# నవభారతి మీకందించిన పుస్తకరత్నాలు

| | | రూ॥లు |
|---|---|---|
| 1. | స్వాతంత్ర్య వీరసావర్కార్ | 8-00 |
| 2. | పదుపుల పెట్టి | 10-00 |
| 3. | భారతీయ కరణి | 10-00 |
| 4. | మనదృక్కోణం | 10-00 |
| 5. | భీష్మయుధిష్ఠిర సంవాదం | 10-00 |
| 6. | హిందూ విజయ దుందుభి | 12-00 |
| 7. | ఉజ్జయిని పతనం | 13-00 |
| 8. | మార్క్సిజమా? మానవతా వాదమా? | 13-00 |
| 9. | వందేమాతరం | 13-00 |
| 10. | ఇస్లాం సామ్రాజ్యవాదం | 15-00 |
| 11. | కర్మయోగి దీనదయాళ్ ఉపాధ్యాయ | 16-00 |
| 12. | మహారాణా బాప్పా | 16-00 |
| 13. | ఉత్తిష్ఠత! జాగ్రత! | 16-00 |
| 14. | హైద్రాబాద్ అజ్ఞాత చరిత్రపుటలు | 16-00 |
| 15. | సామ్రాట్ పుష్యమిత్ర | 17-00 |
| 16. | స్వాతంత్ర్య సమరజ్వాలలు | 20-00 |
| 17. | చంద్రశేఖర ఆజాద్ | 20-00 |
| 18. | 1857 స్వరాజ్య సంగ్రామం | 20-00 |
| 19. | తెగని సంకెళ్ళు | 20-00 |
| 20. | అల్లూరి సీతారామరాజు | 22-00 |
| 21. | కాళరాత్రి. | 30-00 |
| 22. | జై సోమనాథ్ | 30-00 |
| 23. | యుగద్రష్ట డా॥ హెడ్గేవార్ | 60-00 |
| 24. | పాంచజన్యం | 60-00 |
| 25. | End of A Scientific utopia | 80-00 |
| 26. | Our Tomorrow | 95-[illegible] |

# మన పండుగలు




రచన

ఖండారు సదాశివరావు




సాహిత్యనికేతన్
హైదరాబాదు

ముద్రణ :

వైశాఖ పూర్ణిమ
మే, 1980.



ప్రచురణ :

**సాహిత్య నికేతన్,**
బర్కత్‌పురా
హైదరాబాద్ - 500 027.



ప్రతులకు :

**సాహిత్యనికేతన్,**
బర్కత్‌పురా,
హైదరాబాద్ - 500 027.

**సాహిత్యనికేతన్,**
కాశీశ్వరరావు రోడ్,
గవర్నరుపేట
విజయవాడ - 5200 02.

ముద్రణ :

**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్**
హైదర్‌గూడ, హైదరాబాదు - 500 029.

**వెల రూ. 5-00**

# మనవి

మన పండుగలు ఇదివరలో ముద్రించిన గ్రంథమే. ఇది ద్వితీయ ముద్రణ మాత్రమే.

మన జాతియొక్క సంస్కృతికి ప్రతీకలూ స్ఫూర్తిదాయకాలూ వాటి అంతరంగిక భావాన్ని నేటితరం పూర్తిగా గ్రహించలేనందున, కొందరేమో చేయాలికాబట్టి చేస్తున్నామనీ, మరికొందరేమో ఎందుకు చేయాలనీ అడుగుతున్నారు. విషయాన్ని అందరి అందుబాటులోకి తీసుకు రాకపోతే మన సంస్కృతికి నూతన తరం దూరమయ్యే ప్రమాదముంది. ఈ సంగతిని దృష్టిలో పెట్టుకుని మొదటి ప్రచురణ మన పండుగలను తిరిగి ప్రచురిద్దామని భావించినప్పుడు దయతో ద్వితీయ ముద్రణకు అనుకూలంగా తిరిగి వ్రాతప్రతిని సవరించి అందించిన రచయిత శ్రీ భండారు సదాశివరావు గారికి మా కృతజ్ఞతాపూర్వక వందనాలు.

ప్రమోద వైశాఖ పౌర్ణిమా
9, మే, 1990
భాగ్యనగరం.

ప్రకాశకులు

# సంఘ పుస్తకమాల

| | | వెల |
|---|---|---|
| 1. | సాంఘిక సమానత - హిందూ సంఘటన | 1-00 |
| 2. | నవభారత నిర్మాణంలో R. S. S. | 2-00 |
| 3. | అవును. నేను ఆగ్రహించిన హిందువునే | 2-00 |
| 4. | ఏకాత్మతాస్తోత్రం - ప్రార్థన | 2-00 |
| 5. | నేటి సమస్యలకు శాశ్వత పరిష్కారం | 2-50 |
| 6. | హిందువులెక్కడ వున్నారు ? | 2-50 |
| 7. | శ్రీ గురూజీ (అమర చిత్రకథ) | 3-50 |
| 8. | డా॥ హెడ్గేవార్ (అమర చిత్రకథ) | 3-50 |
| 9. | శ్రీ గురుజీ జీవన యజ్ఞం | 4-00 |
| 10. | ముసునూరి నాయకులు | 4-00 |
| 11. | సంఘ గంగోత్రి డా॥ హెడ్గేవార్ | 5-00 |
| 12. | ఆదర్శ పథం | 5-00 |
| 13. | మన పండుగలు | 5-00 |
| 14. | విజయ విపంచి (7 వ భాగం) | 10-00 |
| 15. | ఆర్. ఎస్. ఎస్. కథ | 25-00 |
| 16. | యుగద్రష్ట డా॥ హెడ్గేవార్ | 40-00 |
| 17. | పాంచజన్యం | 60-00 |

# ముందుమాట

పండుగలు ఆయా జాతుల సంస్కార బిందువులు - సంస్కృతీ దర్పణాలు కూడాను. వాటి అర్థాన్ని, సమన్వయాన్ని సజీవంగా ఉంచు కుంటే, మిగతాపని తమంతటతామే అవి సాధిస్తాయి కనుక ప్రతిపండుగ ప్రయోజనాన్ని విశదీకరించుకోడం, జీవనంలో వాటి అవసరాన్ని పున ర్ధృకరించడం, పునశ్చనవీకరించడం అవసరం.

ఆధునిక భారత చరిత్రలో డా. కేశవరావు బలిరాం హెడ్గేవారు గారు ఒక యుగాన్ని దర్శించిన మహామనీషి. ఆయనపట్ల "మూకం కరోతి వాచాలం" అనేది సార్థకమయ్యేది. హిందూ సంఘటన ప్రారం భించి, హిందూ జనజీవన చైతన్యానికి ఆయన అనుసరింప చేసిన ప్రణా ళికలో ఉత్సవ ప్రణాళిక ఒకటి. ఆయన మొత్తం ఆరు ఉత్సవాలు ఎన్ను కున్నారు. ఉగాది, వ్యాసపూర్ణిమ, జ్యేష్ఠత్రయోదశి, శ్రావణపూర్ణిమ, విజయదశమి, సంక్రాంతి. వీటిని హిందూప్రజలు సార్థకంగా నిర్వహించు కోవాలని వారు అభిలాషించారు.

ఈ ఉత్సవాలలో ఒక్క జ్యేష్ఠశుద్ధ త్రయోదశి తప్ప మిగతా ఉత్స వాలన్నీ హైందవ సమాజం ఏదో విధంగా అనాదిగా జరుపుకొంటున్నవే. జ్యేష్ఠశుద్ధ త్రయోదశి ఒకటే క్రొత్త పండుగ. ఆ రోజున ఛత్రపతి శ్రీశివాజీ మహారాజు హిందూ పదపదషాహీకి ప్రభువుగా పట్టాభిషిక్తుడైనాడు. శివాజీ మహారాజు పట్టాభిషిక్తుడైన ఆ దినం హైందవ సమాజం తన మను గడను శివాజీ పట్టాభిషేక రూపంలో ఈ దేశంలో పునరుద్ధరించుకున్న దినం.

17వ శతాబ్ది శ్రీ శివాజీ జీవనకాలం. ఆయన హృదయంలో తిరిగి హిందువుల దేశమైన హిందూదేశంలో హిందూ సామ్రాజ్య నిర్మాణం చేయాలనే సంకల్పం కలిగింది. ఆ సంకల్పం దేశ చరిత్ర గతినే మార్చింది.

అంతకుముందు ఎందరో రాజులు, చక్రవర్తులు విశాల సామ్రాజ్యాలను స్థాపించిన వారున్నారు. ఆ సామ్రాజ్యలలో బెలూచిస్తాన్, అఫ్ఘనిస్తాన్ కూడా కలిసి ఉండేవి. ఆనాడు ప్రత్యేకంగా హిందూస్వారాజ్యం సామ్రాజ్యం అని చెప్పుకోవలసిన అవసరం స్ఫురించలేదు. తరువాత కుషాణులు, శకులు మొదలగు అనాగరక తండాలు, దురాక్రమణదారులు ఈ దేశం మీదికి దాడి చేయడం, ఆ దాడులను త్రిప్పిగొట్టి, అక్కడి నుండి వచ్చిన వారిని పూర్తిగా స్వదేశీ సమాజంలో లీనం చేసుకోవడం జరుగుతూ వచ్చింది.

సమాజంలో జీర్ణించుకునే శక్తి, సంఘటనలున్నంతవరకు బైటి నుంచి ఎన్ని దాడులువచ్చినా ఇక్కడ సమాజం తన స్వరాజ్య, స్వధర్మ, స్వసంస్కృతీ సంప్రదాయాలను అక్షయంగా కాపాడుకుంటూనే వచ్చింది. ఆ శక్తి సంఘటనల పట్ల ఉపేక్ష, దానితో స్వార్థం పెరిగి, దేశం అనేక రాజ్యాలుగా చీలి, పరస్పర స్పర్థలతో కొట్లాడుకోనారంభం కావడంతోటే బైటినుంచి వచ్చిన ఆక్రామకులు ఈ దేశాన్ని శాశ్వతంగా పరిపాలించాలనే దురాకాంక్షతో, ఇక్కడి ప్రజల స్వత్వ, సత్వాలను క్షీణింపచేయందే తమ వ్యూహం ఫలించదని భావించి, తమ ధర్మాన్ని, తమ సంస్కృతినీ ఈ దేశపు ప్రజల మీద రుద్దనారంభించారు. ఆ ప్రయత్నంలో భాగంగానే మతం మార్పిడులు, దేవాలయాల విధ్వంసం, ఆర్ష జీవనాన్ని అణచి నిర్మూలించ ప్రయత్నించడం మొదలైంది.

అదొక సుదీర్ఘమైన చీకటి యుగం. ఆ చీకటియుగంలో స్వత్వ, సత్వాలు మరచిన ప్రజలకు వెలుగు ప్రసాదించిన మహానుభావుడు ఛత్రపతి శివాజీ. ప్రసిద్ధ చరిత్రకారుడు జదునాథ్ సర్కార్ "శివాజీ తన జీవితం ద్వారా హిందువులు తిరిగి తమ రాష్ట్రాన్ని పునరుద్ధరించుకోగల

రని, రాజ్యాన్ని స్థాపించుకోగలరని, శత్రువులను ఓడించగలరని, తమ రక్షణ వ్యూహాన్ని తామే నిర్మించుకోగలరని తమ కళా సాహిత్యాల వాణిజ్య వ్యాపారాలను, సంరంక్షించుకొని పెంపొందించుకోగలరని, నౌకా సైన్యాన్ని నిర్మించుకుని, విదేశీయులతో సమాన స్థాయిలో, సమాన షరతులతో జల యుద్ధాలను నడుపుకోగలరని ఋజువు చేశాడు. ఆధునిక హిందువుకు తన సంపూర్ణ వ్యక్తిత్వాన్ని వికసింప చేసుకోడం నేర్పిన మహా వ్యక్తి శ్రీ శివాజీ" అని అంటాడు.

ఆ మహా వ్యక్తి ఈ దేశంలో తాను అభిషిక్తుడై హిందూజాతికి ఈ దేశపు స్వామిగా అభిషేకించిన రోజు జ్యేష్ఠశుద్ధ త్రయోదశి. అది హిందూ జాతికి అపూర్వ పర్వం. దానిని కూడా జాతీయ పర్వంగా లోకమాన్య బాలగంగధర తిలక్ జాతీయోద్యమంలో భాగంగా నిర్వహింపచేయనారంభించారు. యుగద్రష్ట డాక్టర్ హెడ్గేవార్ ఆ ఉత్సవం జరుపుకునే పరిపాటిని రాష్ట్రీయ స్వయంసేవక్‌సంఘం ద్వారా దేశమంతటా వ్యాపింపచేశారు.

ఈ ఉత్సవాలు మన జాతికి శ్రీకవచాలు. మన గతాన్ని స్మరింప చేసి, వర్తమానాన్ని పరామర్శించుకుంటూ, భవిష్యత్తును నిర్మించుకునే ఉత్సాహస్ఫూర్తులనిచ్చే సందేశ సంధులు.

వీటిని అన్వయించి గ్రహించడానికి ఈ పుస్తకలలో ప్రయత్నం జరిగింది. ఈ వివరణలలో పెద్దలు ప్రసాదించిన భావవైభవమే పునశ్చ జ్ఞాపకం చేసుకోడం జరిగింది. ఈ పండుగల వివరణ పాఠకులకు విశుద్ధ జాతీయ దృక్పథాన్ని కల్గింపచేస్తే ఈ ప్రయత్నం సార్థకం అయిందని భావిస్తాను.

ఈ పుస్తకం ఇదివరకే ప్రచురింపబడింది. ఈ ముద్రణలో అక్కడక్కడ కొన్ని మార్పులు చేర్పులు జరిగాయి. పాఠకులు సహృదయంతో స్వీకరిస్తారని ఆశ.

వైశాఖ శు॥ విదియ,
ప్రమోదూత-
1990.

భండారు సదాశివరావు

# విషయసూచిక

తొలిపలుకు

# ఉగాది

భారతదేశంలో కాలగణన మూడు విధాల సాగుతున్నది. మనది చాంద్రమానం. సౌరమానం, బార్హస్పత్య మానాలుకూడా దేశంలో ఆయా ప్రాంతాల్లో అనుసరింపబడుతున్నాయి.

చాంద్రమానం అంటే చంద్రుడికీ, నక్షత్రాలకు సమీపసంబంధాన్ని పురస్కరించుకొని గుణించే విధానం.

ఉగాది "యుగాది" అనే సంస్కృత పదానికి తెనుగు రూపం. తెనుగు, కర్ణాటక, మరాఠీ, మాళవ మొదలగు ప్రాంతాలలో సంవత్సరం చైత్ర శు॥ పాడ్యమి అంటే ఉగాదితో ప్రారంభమవుతుంది. కాలమానాన్ని గణించడానికి ఇది తొలి రోజు. శిశిర ఋతువు ఆకురాలు కాలం. ప్రకృతి చలితో గడ్డకట్టుకొనిపోతుంది. మోడు వారుతుంది. సంకోచం పొంది ఉంటుంది. శిశిరం తర్వాత వసంతం వస్తుంది. వసంతాగమనంతో ప్రకృతి ఒక్కసారి పులకిస్తుంది. కొత్తదనాన్ని సంతరించుకుంటుంది. చెట్లు చిగిర్చి నూత్న సృష్టి అంకురిస్తుంది. సర్వత్రా ఒక చైతన్యం అంతరంగ ములను కదిలిస్తుంది. సృష్టి అంతటా నవకంతో పూలు తొడిగి, పిందెలు వేసి, కాయలు కాచి ఫలవంత మవుతుంది. కోకిలలు ఈ నూతనోత్సరానికి చక్కని గీతాలతో స్వాగతం పలుకుతాయి. శిశిర శైథిల్యం వదిలి సంకోచం పోయి వసంతం నూతనత్వంతో ప్రఫుల్లమవుతుంది. ఇది సృష్టి క్రమం.

ప్రకృతిని నియమించే ఈ విధానమే వ్యక్తుల యొక్క, జాతుల యొక్క స్వభావాన్ని కూడా నియమిస్తుంది. చక్రాకారములవలె సృష్టిలో కష్టసుఖాలు ఒకదానివెంట ఒకటి వస్తూనే ఉంటాయి. కష్టాలతో, బాధలతో

దాస్యంతో సంకోచం పొంది చైతన్యం నశించినపుడల్లా ఎవరో ఒక మహా వ్యక్తి ఒక మహోద్యమం జన్మించి చైతన్యం నించి వికాసవంతమైన నూతన జీవితాన్ని నిర్మించడం సహజంగా జరుగుతుంది. ఆ మహావ్యక్తి ఆ మహోద్యమం జన్మించిన రోజు ఒక నూతన శకానికి, ఒక యుగానికి ప్రారంభ దినమవుతుంది. అది ఉగాది. ఆ దినం ఆ జాతికి పర్వదినం. ఆ దినం ఆ జాతి హృదయంలో చైతన్య స్రవంతిని ప్రవహింప జేసిన దివ్య పురుషుల సంస్మరణ దినం. పూర్వపు కష్టాలను ప్రస్తుత కర్మఠ జీవనాన్ని, భవిష్యత్తును గురించిన దివ్య స్వప్నాలను ఒకటిగా కలిపి కదలించి ప్రజలను సంఘటితంగా నడిపించే శుభ దినం. దీనికి సూచనగా నేమో కొంత బాధల చేదును, కొంత కర్తృత్వపు అలుపు పులుపును, కొంత సత్ఫలితాల మాధుర్యాన్ని చూపే తీపి, వేపపూత, పులుపు తీపి కలిపిన పచ్చడి సేవించే అచారం వచ్చి ఉండవచ్చు.

ఆ రోజునుంచి తొమ్మిది రోజుల వరకు, ఎప్పుడో త్రేతాయుగంలో జన్మించి యీనాటి వరకు దేశమంతటా అందరి మనసుల్లో మెదిలే శ్రీరామచంద్రుని నిత్యస్మరణ నవమి వరకు జరుగుతుంది. నవమినాడు శ్రీరాముడు జన్మించాడు. ఒకనాడు దేశంలో క్షాత్రశక్తి సంకోచించుకుని పోయింది. ధర్మాన్ని, ధర్మాచరణచేసే ప్రజలకు చక్రవర్తి, రాజు లేడు. ప్రతి వ్యక్తీ మోహనిద్రలో పడివుండిన కాలమది. రావణాసురుని ఆగడం మితి మీరింది. ఋషులూ, మునులూ, సామాన్యప్రజలూ సుఖంగా నిద్ర పోయే యోగానికి కూడా నోచుకోలేదు. అలాంటి సమయాన శ్రీరామ చంద్రుడు కోదండం చేత ధరించి - రాజ్యాన్ని - స్వీయజనాన్ని, సుఖాన్ని వదిలి పదునాలుగేండ్లు యావద్దేశంలో తిరిగి రాక్షసులను సంహరించి లోక కంటకుడైన రావణాసురుని వధించాడు. పామరుడైన పడవ నడిపే గుహుని నుండి మహా తపస్సంపన్నులైన ఋషులదాకా - గిరిచర వనచరులతో సహా సమాజాన్ని సంఘటిత పరిచి, రావణాసురునిపై దాడి చేసి, దేశాన్ని బాధాముక్తం చేశాడు.

రాముని చరిత్రే ఒక మహాద్భుత సందేశం. సహస్రార్జునుడు జమదగ్నితో కయ్యానికి దిగి, తనతో క్షాత్రజగత్తు నంతటినీ సంహరించి పరశురాముని సృష్టికి కారకుడైనాడు. అలాంటి పరశురాముని కశ్యపాది ఋషులు దాదాపు నిష్కాసనం చేసినట్లు తొలగిస్తారు. ఆ తరువాత సాగిన వశిష్ఠ విశ్వామిత్రుల వైరం సాగి సాగి, చివరకు శ్రీరాముని జన్మతో ఈ రెండు ధారలు ఏకమై రామరాజ్య ప్రతిష్ఠకు దోహదం చేశాయి. సమాజ స్వయం భూశక్తిని రాజశక్తి తృణీకరించరాదు. రాజశక్తిని సమాజ స్వయం భూశక్తి ధిక్కరించరాదు. రెంట సమన్వయాన్ని సాధించ జన్మించిన భారత సంస్కృతీ స్వరూపుడు రామచంద్రుడు.

భారతీయుల దృష్టిలో శ్రీరాముడు ఆదర్శరాజు, ఆదర్శసోదరుడు, ఆదర్శపతి, ఆదర్శపురుషుడు. భారతీయతే ఆయనగా అవతరించిందంటే అది సనాతన సత్యం. అందుకే భారతీయులకు - భారతీయులకే కాదు - మానవ ధర్మమైన సనాతన ధర్మాన్ని ఆచరించే ప్రతి వ్యక్తికీ, అంతా రామమయం - జగమంతా రామమయమై వెలిసింది నాడే 'రామరాజ్యం' భారతీయుల ఆదర్శమైన రాజ్యంగా వెలిసింది.

అలాంటిదే ఆ తరువాత యుధిష్ఠిరుని కాలంలో జరిగింది. కౌరవులు అధర్మమార్గాన్ని అవలంబించి ధర్మమూర్తులైన పాండవులను కించపరచి నపుడు ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో కౌరవుల నోడించి ధర్మరాజు పట్టాభిషిక్తుడైన రోజిది. ధర్మానికి విజయం లభించిన రోజిది. ధర్మపక్ష పాతికనుకనే శ్రీకృష్ణ భగవానుడు ధర్మవిజయానికి కేంద్రమైన పార్థుని రథాన్ని నడిపి, ధర్మమెక్కడో తానక్కడ అనే సత్యాన్ని ప్రపంచానికి చాటాడు. పన్నెండేండ్లు వనవాసం, ఒక ఏడు అజ్ఞాతవాసం గడిపి బాధలు

పడ్డా చివరికి ధర్మం జయిస్తుందనే చిరంతన సత్యాన్ని గుర్తు చేయడానికి ప్రజాధర్మాన్ని, లోకహితాన్ని ఆకాంక్షించి పనిచేసే వ్యక్తులకు జయం లభిస్తుందనే నైతికశక్తిని ప్రసాదించడానికే యుధిష్ఠిరశక మారంభమైంది.

తర్వాతి కాలంలో సమాజం భోగభాగ్యాలలో మైమరచి, నిత్య జాగృతమైన ప్రజాజీవితంలోనే తన శక్తి ఉంటుందనేమాట మరచినపుడు విదేశీయులైన శకులు భారతభూమి నాక్రమించి మధ్యభారతందాకా వచ్చారు వారికి ధర్మంలేదు. సంస్కృతీ సభ్యతలు లేవు. భారతదేశంమీద పడి ఎన్నో అక్రమాలు, అత్యాచారాలు జరిపారు. అలాంటి విపత్తునుండి దేశాన్ని కాపాడినది విక్రమాదిత్య సార్వభౌముడు. సిప్రా నదీతీరంలో ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటైన మహాకాళీక్షేత్రం ఉజ్జయిని అతని రాజధాని. ఆయన నేతృత్వంలో మాళవ సైన్యాలు కదిలాయి శకులను దేశంనుండి తరిమి భారతదేశాన్ని శత్రుముక్తంగా చేశాయి.

కాని విదేశీయుల దండయాత్రలు ఆగిపోలేదు. తిరిగి దేశంలో పరాయిమూకలు ముసురుకోనారంభించాయి. నేటికి 1890 సంవత్సరాల పూర్వంనాటి మాట. ప్రజలు నీరసులైనారు. ఒకవిధంగా వారిలో జడత్వం వ్యాపించింది. అప్పుడు ఆవిర్భవించాడు శాలివాహనుడు. సామాన్య పరిస రాలలో జన్మించినవాడాయన. రాజ్యం లేదు. సైన్యాలు లేవు. ఆయనను గురించిన ఒక కథ ఉన్నది. శకులను ఓడించడానికి ఆయన మట్టితో మనుషులను నిర్మించి, వారిలో ప్రాణంపోసి, ఆ మనుష్యులను సైనికులుగా తీర్చిదిద్ది ఆ శక్తితో శకులను జయించాడట.మట్టిలా ప్రాణహీనులై, జడులై చైతన్యంలేని సాధారణ ప్రజలను సంఘటితపరిచి వారిలో ధర్మనిష్ఠను, సమాజ భావాన్ని, పౌరుష శక్తులను నింపి, అలా సమీకరించిన సంఘటిత శక్తితో శకులను పూర్తిగా ఓడించాడు. ఇంతేగాక పరాభవింప

బడి తిరిగి పోజాలని పరాయివారిని తమలో లీనం చేసుకున్న ఉదార పౌరుషమూర్తి శాలివాహనుడు ఆనాటి శకులు, ధర్మం, సంస్కృతీ సభ్యత ఎరుగని ఆ దోపిడిగాండ్రు, శాలివాహనుని రాజ్యకాలంలో హైందవ సమాజంలో లీనమై, ఒకటై పోయినారు. నాటి సమాజశక్తి విదేశీయులను సంస్కరించి జీర్ణించుకున్నది. నాటి విజయగాధకు చిహ్నంగా చైత్రశుద్ధ పాడ్యమి నుంచే శాలివాహనశకం ప్రారంభమై నేటికీ తెలుగు, కన్నడ, మరాఠీ,మాళవ ప్రాంతాలలో స్మరింప బడుతున్నది.ఆచరించ బడుతున్నది.

ఈ యుగాది రోజుననే శా.శ. 1811 విరోధినామ సంవత్సర చైత్ర శుద్ధపాడ్యమి రోజున రాష్ట్రీయ స్వయంసేవక సంఘనిర్మాత - పరమ పూజ్యులు డాక్టర్ కేశవరావ్ బలీరాం హెడ్గేవారు జన్మించారు. మన జాతి అనేక మహత్తర విజయాలను సాధించిన ఆ రోజున-ఆ పుణ్య పర్వాన - ఆయన జన్మించడం కూడా ఒక సార్థకమైన సంఘటనే. ఆయన తన వ్యక్తిత్వాన్ని పూర్తిగా హిందూసమాజంలో లయింపచేసు కున్న మహామనీషి. అందుకే తన జన్మదినం ప్రత్యేకించి జరుపుకునే వీలు లేకుండా, మనకా అవకాశమే లభించకుండా వుండేందుకే తపస్సు చేసి ఉగాదిరోజున బహుశః ఆయన జన్మించి ఉండవచ్చు.

పూజ్య డాక్టర్ జీ జన్మించింది భారతదేశాన్ని ఆంగ్లేయులు పరి పాలిస్తున్న కాలంలో. ఆంగ్లేయుల రాజ్యం అనేక రకాలుగా పటిష్టంగా వ్రేళ్ళు పాతుకొని ఉన్న సమయం అది. సమాజం ఆత్మవిస్మృతితో, అజ్ఞానంతో, నిరంతర శోషణతో, అసంఘటితమై, అశక్తమై బానిసత్వపు సంకెలలో తగులుకొని తపిస్తున్నది. ప్రతిచోట నిస్పృహ, నిరాశ వ్యాపించింది. మనకాంగ్లేయులే గతి అని కొందరు, హిందుత్వమే నీర సత్వమని కొందరూ, ముస్లింల సహాయం లేనిదే స్వరాజ్యసాధనకు దారి

దొరకదని కొందరూ వాపోతుండేవారు. దేశంపట్ల, సమాజంపట్ల మమత్వం నశించి వ్యక్తిగతమైన అల్పపు కోరికల కొరకు ఆంగ్లేయులకు దాసులై, స్వత్వం నశించి, మేధావులు సహితం దారుణమైన హీనస్థితికి దిగజారారు. ఇది హిందువులదేశం - ఇది మనదేశం. ఇది చారిత్రకసత్యం. హిందువులలో సంఘటన, దేశభక్తి ఉంటే వారి నెవ్వరూ ఓడించజాలరు. దేశానికి పరాభవం జరుగదు. అలాకాక, కులం పేర, ప్రాంతాల పేర, వర్ణాలపేర పోరాడుకుంటూ, అల్పమైన ప్రయోజనాలకు తలఒగ్గితే పరాభవం తప్పదు'' అనే వివేకమే కన్పించకుండా పోయింది.

దేశంలో ఒకవైపు ఆంగ్లేయుల రాజ్యం. మరోవైపు ముస్లిం, క్రైస్తవుల దేశ విచ్ఛిన్నకరమైన ప్రయత్నాలు, ఉద్యమాలు. చుక్కాని లేని ఓడల్లా ఏ సమస్య వెనుకైనా పడే నాయకులు - అలాంటి దీనమైన కాలంలో పూజ్య డాక్టర్‌జీ జన్మించారు.

'క్రియాసిద్ధిః సత్వేభవతి మహతాం నోపకరణే'

ఆయన జన్మించింది పూట గడవని పేదరికంలో. చదువుకున్నది అనేక కష్టాలు పడుతూ. అయినా బాల్యం నుంచే ఆయనలో మహాజ్యోతి ఒకటి వెలుగుతుండేది. దారిద్ర్యం వల్ల ఆయన కృంగిపోలేదు. స్వార్థం కొరకు అవకాశాలతో సంధి చేసుకొనలేదు. ఆటలలో పాటలలో బాల్యం నుంచే ఆయన రాష్ట్ర జాగృతికి బీజాలు చల్లారు. విద్యార్థిగా 'వందే మాతరం' నినాదాలిచ్చి నాటి తెల్లదొరల కోపాలకు గురి అయినా, విప్లవ కార్యక్రమాలలో పాల్గొని యౌవన ఉద్రేకానికి శాంతి వెదికినా, రాజకీయాలలో ప్రజలలో దేశభక్తిని ప్రచారం చేసినా ఆయనను వేధించిన ప్రశ్న ఒక్కటే. ఏ రాష్ట్రమైనా, అజేయంగా, అఖండంగా, సమృద్ధంగా చిరంతనంగా వెలుగొందుతుండాలంటే ఏమిటి మార్గం? ఏది లోపించినందున ఇంత విశాల

దేశాన్ని, సమాజాన్ని, ఇన్ని విధాల సర్వశ్రేష్ఠమై కీర్తిపొందిన రాష్ట్రాన్ని, అనాగరికులైన కొద్దిమంది విదేశీయులు, విధర్మీయులు అలలు అలలుగా వచ్చి గెలవగలుగుతున్నారు?

పూజ్య డాక్టర్‌జీ తమ జీవితంలో గుర్తించిన సత్యమే రాష్ట్రీయ స్వయం సేవక సంఘం. ఏ సమాజంలో వ్యక్తి తనను రాష్ట్ర శరీరంలో ఒక అవయవంగా భావించి, తన జీవితాన్ని ఆ భావాన్ని అనుసరించి నడుపుకోడో, ఏ సమాజంలో ఈ భావం అనుశ్రుతంగా గుర్తు చేయబడే వ్యవస్థ ఉండదో, ఏ సమాజంలో ఆ భావాన్ని, ఆ వ్యవస్థనూ నిర్మించి, పోషించి, నడిపించే నిస్వార్థపరులైన రాష్ట్ర సేవకుల యొక్క నిగర్వమైన, నిస్వార్థమైన నిష్కళంకమైన ప్రయత్నం ఉండదో ఆ సమాజానికి ఓటమి తప్పదు అని డాక్టర్‌జీ గుర్తించారు.

నాటినుంచి ఆయన జీవితమే మారింది. శిథిల శిశిర సంకోచంపోయి వసంతం ప్రస్ఫుటించింది. సమాజ సంఘటనకు ఆయన తన సర్వస్వాన్ని సమర్పించారు. తాను దారిద్ర్యావస్థలో ఉన్నా, వైద్య వృత్తిలో డబ్బు సంపాదించుకోవాలనే కోర్కెకు తావీయక తమ జీవన సర్వస్వాన్ని దేశానికి అర్పించారు. ఈ దేశం హిందువులది. హిందూరాష్ట్ర భావనే ఈ దేశానికి ప్రాణం. హిందువులు పరస్పర ప్రేమావగాహనలతో కలసి ఒకే దృఢమైన శృంఖలంవలె మెలగాలి. వ్యక్తికంటే సమష్టి ముఖ్యం, సమష్టికి సరిపడని ఏ వికారమూ మనిషిలో ఉండరాదు. తాను విశాల రాష్ట్ర పురుషుని శరీరంలో ఒక చిన్నపాటి అవయవము అనే దృక్పథంతో ముందుగా ఆయన తన వ్యక్తిత్వాన్ని సమష్టితో ఏకాత్మతను సాధించ డానికి తపస్సు చేసినట్లు సాధన చేశారు. అదొక యజ్ఞమే. ఆ మహా యజ్ఞంలో ఆయన పడిన పాట్లకు లెక్కలేదు. అలా తనను సంఘటన కర్తగా రూపొందించుకొని, విజయదశమీ దివ్య పర్వాన రాష్ట్రీయ స్వయం సేవక సంఘాన్ని ఆవిర్భవింపచేశారు.

ఒక్కసారి సంఘటన కార్యాన్ని తలపెట్టిన తరువాత, ఆ సంఘటన కార్యానికి అనుకూలమైన జీవనాన్ని అనుసరించాలి. అలవరచుకోవాలి కనుక ఈ ఈ విశాల సమాజం నాది అని నమ్మి వ్యవహరించవలసిన వ్యక్తి స్వభావం, శీలం, వ్యవహారం ఎలా ఉండాలో ఆయన ఆచరించి చూపగలిగారు. ప్రతి హిందువును డాక్టర్‌జీ ఆత్మ సోదరునిగా ప్రేమించ గలిగారు. ఏ వాదాల ననుసరించినా హిందువులు ఏ వర్గానికి చెందినవాళ్ళ మనుకొన్నా హిందువులే. ఏ సంస్థలో ఉన్నా, ఏ స్థాయిలో ఉన్నా హిందువులే. చెడూ, మంచీ రెండూ నావే ననుకొని, మంచిని పెంచడానికి ఎంత ఆత్మీయమైన శ్రమ అవసరమో, అంతే ఆత్మీయమైన నిశ్చయం చెడును తొలగించడానికి అవసరమని ప్రకటించారు.

సంఘటనలో కర్కశత్వం, వాక్పారుష్యం పనికిరావు. దానికై డాక్టర్‌జీ అహర్నిశలూ తపస్సు చేశారు. "స్వభావో దురతిక్రమః" అంటారు. డాక్టర్‌జీ కుటుంబంలో కోపం ఒక పాలు ఎక్కువ అంటారు. ఐనా ఆ కోపాన్ని శివుడు హాలాహలాన్ని మింగినట్లు మింగారాయన.

సంఘటనకు క్రమశిక్షణ ప్రాణం. చేసి చెయ్యమనాలి.

"యద్యదా చరతి శ్రేష్ఠః తత్ర దేవేతరో జనః" శ్రేష్ఠులైన మహానుభావులు నడిచే మార్గాన్నే ప్రజలంతా నడుస్తారు. సంఘటనకు అనుష్ఠానంగా ఆయన హిందువులను ప్రతినిత్యా ఒకచోట చేర్చే అభినవ పద్ధతిని ఆవిష్కరించారు.

రోజుకొక గంట. ఆ గంట తనదికాదు. నలుగురిలో ఒకడై, నలుగురితో ఒకడుగా జీవించే సంస్కారం పొందడానికి, ఈ దేశం ప్రపంచంలో ఏ ధర్మాన్ని ప్రతిష్ఠించడానికి జీవించి ఉన్నదో ఆ ధర్మాన్ని విశ్వ కళ్యాణ భావనని అభ్యసించడానికి ఆ గంటలో ఆ నలుగురూ కలిసిన చోట నిరంతరం సాధన జరుగుతుంది. అలా గంటపాటు, పరిమిత క్షేత్రంలో నివసించే హిందువులు ప్రతిదినం కలిసి సంఘ

ధర్మం కొరకు నిర్దేశితమైన కార్యక్రమాలను నడిపే స్థంశాఖ. ఆ శాఖకు నిత్యమూ ఒక గంట సేపు తప్పనిసరిగా, సరియైన కాలానికి వెళ్ళి తీరాలని నియమం. సంఘాన్ని నిర్మించింది తానే. అయినా తాను గూడా ఆ నియమానికి బద్ధుడే.

కేవలం వ్యక్తిగతమైన స్వార్థాలకు స్వయం సేవకుడు అంకితం కారాదనేది ఆదర్శం. సుఖాలకు అంతు ఉండదు. డాక్టర్‌జీ ఇంటి స్థితి అతి దయనీయంగా ఉండేది. రోజు గడవటం కష్టంగా ఉండేది. కాని ఆ దీనావస్థను ఆయన ఎన్నడూ ఎవ్వరితోనూ చెప్పుకోలేదు. తన ప్రతి క్షణాన్ని ప్రతి దినాన్ని సంఘానికి అర్పించిన అపర దధీచి ఆయన.

సంఘానికి తను మనోధనాలు సమర్పించాలి. ప్రతి ఏటా గురు దక్షిణ నూటొక్క రూపాయలు సమర్పిస్తూ, అంత తక్కువ సమర్పిస్తున్నానే అని చాలా బాధపడేవారట. ఆయన ఆర్థిక స్థితికి ఆ సమర్పణ చాలా ఎక్కువ ఐనా అంతటి సమర్పణ భావం వారిది.

ఆయన వ్యక్తిగత జీవనమంటూ పూర్తిగా మరచిపోయినారు. స్వయం సేవకులు అహర్నిశలు ఆయన చుట్టూ ఉండేవారు. ఎవరైనా వచ్చి తిరిగి పోతారేమోనని అన్నం తినేటప్పుడు కూడా తలుపు కెదురుగా కూర్చునే తినే వారట.

ఆయన ప్రముఖ రాజకీయవేత్త, పత్రకారుడు. అప్పటికే ఆయన ఆ ప్రాంతమంతటిలో పేరు పొందినవాడు. సంఘం, కీర్తి ప్రతిష్టలకు ప్రవచనాలకు, ప్రచారాలకు దూరంగా ఉంటూ నిర్మాణాత్మకంగా హృద

యాలను కలపడానికి, స్నేహంతో ఎదలు తొణికిసలాడేటట్లు చేయడానికి జన్మించింది. ఆ ఆదర్శానికి అనురూపంగా ఆయన సంఘ ప్రారంభం తర్వాత బహిరంగమైన ఇతర కార్యక్రమాలతో సంబంధాన్ని క్రమంగా వదులుకున్నారు. సంఘంలోని ప్రతి వ్యక్తి కష్టసుఖాలలో భాగం పంచుకునేవారు. ప్రతి ఇంటి కష్టం ఆయన కష్టమే. స్వయం సేవక్ సమస్య చిన్నదైనా పెద్దదైనా తన సమస్యే. అలా అన్నీ మరచి సంఘమయ జీవనం గడిపారు.

సత్సంస్కారాలతో ఏ వ్యక్తినైనా మార్చవచ్చునని ఆయన విశ్వాసం. రాష్ట్రీయ సంఘటనలో సంస్కారాల ప్రయోజనాన్ని ఆయన గుర్తించారు. శైశవ, యౌవనాల స్వభావం మైనం లాంటిది. ఎటుమలిస్తే అటు మలచబడేది. పూజ్య డాక్టర్‌జీ చుట్టూ ఉత్సాహ, ఉద్రేకాలు పొంగులు వారే యువకులు చేరుతుండేవారు. మహా శిల్పిలా ఆయన వారితో దేశానికి కావలసిన గుణసంపదలను నిర్మాణం చేయడానికి అహర్నిశలూ కష్టపడేవారు. అలా సంఘ సంస్కారలలో సంస్కార బీజాలను, ఆదను ఎరిగి నిక్షేపించి వానికి బలం కూర్చి, అవి పెరిగి సంఘటన కవ సరమైన గుణగణాలు పుష్పించి ఫలించేట్టు చూచేవారు. నిత్యజీవనంలో సంఘశాఖలలో, మిగతా కార్యక్రమాలలో, యావజ్జీవితంలో ఆయన ఏమాట చెప్పినా, ఏ పని చేసినా, సంఘటనకు ఉపకరించేదే కాని వృథావాక్కు, వ్యర్థక్రియా ఆయన నుండి వెలువడలేదు.

సంఘ శాఖలు దేశంలో ప్రారంభమైనాయి. శిశువు నుంచి వృద్ధుని వరకు, గర్భదరిద్రుని నుండి ఆగర్భశ్రీమంతుని వరకు, పరమ పామరుని నుండి మహాజ్ఞాని వరకూ అందరూ ఒక్కటే. మాతృదేవి ఒడిలో పవిత్రమైన సంఘ శాఖలో, పునీత భగవాధ్వజచ్ఛాయలలో అఖండ మాతృ స్వరూపాన్ని స్మరిస్తూ, "యా చి దేహీ, యా చి డోలా" ఈ

కాయంతో ఈ కన్నులతో మాతృయశస్సును సాక్షాత్కరించుకునేందుకు తనను బోలిన, తన బాటలో నడవగలిగిన లక్షల స్వయంసేవకుల నిర్మాణానికై ఆయన ఈ సంఘటన మంత్రాన్ని దేశానికి ఇచ్చారు.

స్వయం సేవకులకు పూజ్య డాక్టర్‌జీయే పరమాదర్శం. అందుకే క్రమ శిక్షణలో, కష్టాలను లెక్క చేయక చుట్టూ కన్పించే మెరుగుపూతల తళుకు బెళుకు కార్యక్రమాల మోహంలో పడక, శాఖలలో స్వయం సేవకులు స్నేహంతో కలిసి మాతృస్తవం చేసి, హిందూ సమాజంలో అంతర్గతంగా వున్న ఏకత్వాన్ని వెలువరిస్తున్నారు. పుట్టటం, పెరగడం,విద్య, వివాహం, సంపాదన, సంతానం, చివరకు చావడం - ఇవేకావు లక్ష్యాలు. ఈ మన సనాతన హిందూ సమాజము కోసమే సమాజసంఘటన కొరకే మన పుట్టుక, మన చదువు, మన జీవనసర్వస్వం అనే భావనతో, జీవించడాన్ని పరమ పూజనీయ డాక్టర్‌జీ మనకు నేర్పారు. ప్రతి వ్యక్తిలో సమాజ భావంతో నిండిననాడే మనకు ముక్తి. వ్యష్టి సమష్టుల సంఘర్షణలో సమష్టి భావనా రూపంలో వ్యక్తి నిల్చున్ననాడే సమాజానికి మేలు.

డాక్టర్‌జీ అందుకే హిందూ సమాజాన్ని దైవస్వరూపంగా ఆరాధించారు. సమాజంలో చెడు ఉన్నమాట నిజమే. అయినా ఆ చెడును చూచి, ఆయన అసహ్యించుకోలేదు. స్వార్థాన్ని, విభేదాలను చూచి ఆక్రోసించలేదు. విరోధాన్ని చూచి చలించలేదు. ఓపికతో, ప్రేమతో, చక్కని ఒరవడితో మనసులను ఆకర్షించి అహర్నిశలు కృషిచేసి, నెత్తురు నీరుగా చేసి అల్పవయస్సులోనే అనల్పమైన సంఘటనను నిర్మించి పరమపదించారు.

స్వయంసేవకుల కాయన మార్గంలో నిత్యమూ ఆత్మపరిశీలన చేసుకుంటూ, ప్రశ్నలెదురైనప్పుడు ఆయన జీవనం నుంచి సమాధానాన్ని పొంది, మనలాంటి అనేకమందితో ఒకరమై సంఘశాఖలద్వారా హిందూ సమాజంలో అజేయమైన బలాన్ని, సంఘటనను నిర్మించడానికి మనం చేసుకున్న సంకల్పాన్ని ప్రతి సంవత్సరాదినాడు స్మరించుకుంటాం. సంవత్సరాది పర్వం అలా ఒక సంకల్ప స్మరణదినం; పునరంకితం కావలసిన దినం.

# హిందూ సామ్రాజ్య దినోత్సవం

హిందూదేశచరిత్రలో ఛత్రపతిశివాజీమహారాజుకు ఒక ప్రత్యేకమైన గౌరవస్థానమున్నది. ఆయన జ్యేష్ఠశుద్ధ త్రయోదశినాడు హిందూ పద పదషాహీకి ప్రభువుగా రాజ్యాభిషేకం చేసుకున్నాడు. లోకమాన్య బాల గంగాధరతిలక్ ఛత్రపతి శివాజీ జయంతి ఉత్సవాలను జరుపుకునే సాంప్రదాయానికి మొదట మహారాష్ట్రంలో అంకురార్పణం చేశారు. అది క్రమంగా దేశమంతటా వ్యాపించింది. వంగ విభజనతో దేశంలో పొంగి పొరలిన జాతీయ పునరుత్థాన కార్యక్రమాలలో శివజయంతికి కూడా ప్రధానస్థానం ఏర్పడింది. 1925లో సంఘం ఆరంభమైనతర్వాత శివ పట్టాభిషేకదినాన్ని జాతీయ పర్వంగా సమాజోత్సవాలలో ఒకటిగా జరిపే పరిపాటిని డాక్టర్జీ ప్రారంభించారు.

సమాజానికి ఆదర్శమెవరు ? అనే ప్రశ్నకు "శివాజీ మహారాజు" అని డాక్టర్జీ సమాధానం చెప్పారు. అలాగని ఈ దేశపు గరిమా గౌరవాలను, ఆత్మను కాపాడి నిలిపిన రామకృష్ణులు, మనుభగీరథాదులు, కశ్యప అత్రి వశిష్టాదులు, చంద్రగుప్త, చాణక్య సముద్రగుప్తాది పరమ దేశభక్తులు, రాణాప్రతాప్, గురుగోవింద, దుర్గాదాసు లాంటి వీరశిరోమణులు మనకు ఆదర్శం కాదా ?

వారందరూ మన కాదర్శమే. సందేహం లేదు. కాని మానవుని బుద్ధి సమీపవర్తి లక్ష్యాన్ని త్వరగా గుర్తిస్తుంది. ప్రాచీన మహావ్యక్తుల జీవనములు కథలై కన్పిస్తాయి. అందులో కొందరిని భగవంతులని, అవతారమూర్తులని వ్యవహరించడం మొదలైంది.

శ్రీరామచంద్రుడు మర్యాదా పురుషోత్తముడు. ఆదర్శతనయుడు, ఆదర్శజనకుడు, ఆదర్శ సోదరుడు, ఆదర్శ పరిపాలకుడు. మానవ జీవితంలో ఆయన ప్రతిపాత్రకు ఒక అత్యున్నత ప్రమాణాన్ని అనితరంగా నెలకొల్పారు, శ్రీరాముడు భారత హృదయారాధ్యుడు. శ్రీకృష్ణుడో! ఆయన శాశ్వత ధర్మ గోప్తధర్మ విజయానికి ఎత్తిన పతాక. శ్రీకృష్ణుడు జీవిత మంతా ధర్మసంగ్రామ రంగంలో గడిపిన దివ్యమూర్తి. అలాంటి శ్రీరామ కృష్ణులను అవతార పురుషుల క్రింద జమకట్టాం.వాళ్ళు దేవుళ్ళు.వారి స్మరణ చేస్తే చాలు. వారిని మనం అనుసరించగలమా! సాక్షాత్ ఈశ్వరులైన వారె క్కడా, మనం-మనుషులం-మనమెక్కడ? అని తప్పుకోవడానికి భక్తి కవ చాన్ని కప్పుకుంటున్నాం- కాని శివాజీ విషయంలో అలా వీలులేదు. ఎందు కంటే, అతిసన్నిహిత చరిత్ర పురుషుడు శివాజీ. నేటికీ శివాజీ పౌరుషాన్ని హత్తుకున్న చిహ్నాలు సజీవంగా అనేక ప్రాంతాలలో కన్పిస్తాయి. శివాజీ నిర్మాణము చేసిన స్వరాజ్యం దేశం నుండి పరాయి పరిపాలనాపీడను తొలగించడానికి ప్రయత్నించింది. కనుక శివాజీ చరిత్ర ఆధునిక చరిత్రలో తొలిపుట లాంటిది. మన కంటిముందున్నటువంటిది. కనుకనే మనం శివాజీని ఆదర్శంగా స్వీకరించాం.

అయితే శివాజీ మనకాదర్శ ప్రాయుడు కాగలగడానికిగల కారణాలు ఏవి?

జీవితం బంగారం లాంటిది. రాపిడి పెడితే మెరుస్తుంది. లేనిచో మట్టి ముద్దే. అలాంటిదే సమాజంలోని శక్తి.

హిందూ సమాజం చిరకాలం సుఖ సంపన్నంగా జీవించింది. జీవితంలో సంఘర్షణ లేకుండా అలా వర్ధిల్లిన కారణాన ప్రజ ఆత్మా శ్రయమై వ్యక్తి నిష్ఠమైంది. "మనకు శ్రేష్ఠమైన ధర్మం ఉన్నది. మన సంస్కృతీ సభ్యతలు పరమోన్నతాలు.మనం నేర్చుకునేది లేదితరులనుండి.

కనుక మనకు ఇతరులతో సంబంధం లేదు" అనే ధోరణి వ్యాపించింది. దీనివల్ల ఒకవిధంగా పరిసర ప్రపంచంతో సంబంధం తెగింది.

అలా హిందూధర్మం సంకోచంపొంది పూర్తిగా వ్యక్తి నిష్ఠమైంది. ఆచారాలు, సంప్రదాయాలు, ముక్తి, సాధన, భజన, కీర్తన ఒకవైపు; మరోవైపు స్వంతలాభం, కీర్తి, ప్రతిష్ఠ, స్వోత్కర్ష సమాజాన్ని పూర్తిగా స్వార్థమయం చేశాయి. మనకు ఎటునుంచీ ఆపద లేదనే అహంకారం దీనికి తోడయింది. ఇలా సుఖసంపన్నత, అహంకారం, స్వార్థం ఏకమై అసలే ఆత్మాశ్రయమైన సమాజ గుణాన్ని స్వార్థం క్రిందికి మార్చి, స్వధర్మం, స్వదేశం అనే విషయాలను మరచి, 'నేనూ, నా సుఖం' అనే వర్తులంలో వ్యక్తులను బంధించిన పరిస్థితి ఏర్పడింది.

ధర్మం ఒక్కటే, సాధన మార్గాలు వేరైనందువల్ల ఒకరికొకరం, వేరైనాం. దేశం ఒకటే, కాని బయటనుంచి ఆపద లేదనుకొని అలా నిర్భయంగా శతాబ్దాలు నడిచి ఎవరి గూళ్ళలో వాళ్ళం చిక్కుపడిన కారణంగా దేశంతో వ్యక్తికి ఉన్న మాతా- పుత్ర సంబంధాన్ని విస్మరించాం. ఈ సంబంధ విస్మరణవల్ల సహజంగా జన్మించే సోదరభావం పోయింది. దాంతో స్వార్థం మరీ పెరిగింది. అల్లరి చిల్లరి కలహాలు ఆరంభమయినాయి.

ఫలితంగా స్వపర విచక్షణ, స్వధర్మ, పరధర్మ విచక్షణ, స్వదేశ విదేశ విచక్షణ నశించి, జనం కేవలం స్వార్థులు, కుక్షింభరులూ అయి, స్వోత్కర్షకు, స్వాహంకారానికి దేశాన్ని బలివ్వడానికైనా సిద్ధపడేవారు అయినారు. అలా ఎవరికి వారు, ఏ ప్రాంతానికి ఆ ప్రాంతం, ఏ వర్గానికి ఆ వర్గం వేరై దాదాపు పరస్పరసంబంధం లేనివాళ్లైనారు.

బయటినుంచి వచ్చే శత్రువులు ఇది గుర్తించారు. వారికి ఈ దేశంలో ఉన్న ప్రజలందరూ శత్రువులే. వధ్యులే. వీరిలోని భేదాలతో వారికి సంబంధం లేదు. ఆ భేదాలు తమ యశస్సుకు తోడ్పడితే ఉపయోగించుకోవచ్చు గాక. కాని ఇది శత్రు సమాజమే. దీన్ని మూక ఉమ్మడిగా సంహరించడం, ఇక్కడి సంపదలను కొల్లగొట్టడం, ఇక్కడి వారిని తమ మతంలో చేర్చి - కట్టుబానిసలుగా మార్చుకోడం ఇదే వారి ఆశయం.

శివాజీ ఒక సంధి కాలంలో జన్మించాడు. గజనీ దండయాత్ర చేసిన నాటినుంచి, ఔరంగజేబు వరకు మహమ్మదీయులు దాదాపు మొత్తం దేశాన్ని ఆవరించి తమ దుండగాలతో రాష్ట్రీయాత్మను శతధా భగ్నం చేయడానికి అనేక మార్గాల అవలంబించారు కనుకనే హిందూదేశ స్వభావానికి ఆత్మకు సంకేతాలుగా నిలచిన గుళ్ళను, గోపురాలను, దేవతా మూర్తులను, గ్రంథాలయాలను పూర్తిగా విధ్వంసం చేయడమే పనిగా పెట్టుకుని ప్రయత్నించారు. హిందువు జీవనం ప్రతి వైపునా అవమానింపబడటమే, కుదించుకుని పోవడమే, స్వత్వం క్షీణించి జీవచ్ఛవంలా కావడమే ఆగంతుకులైన శత్రువులు కోరింది. ఆ ఉద్దేశ్యాన్ని సాధించడానికి వారు చేయని చెడు లేదు, అమానుషం లేదు.

కాశీ విశ్వేశ్వరుడు సమస్త భారత ప్రజలకు ఆరాధ్యుడు. అట్టి ఆలయాన్ని ధ్వంసం చేశారు. ఇక్ష్వాకుల వంశ వేదిక, శ్రీరాముని రాజధాని అయోధ్య. అది బాబరు చేతులలో శిథిలమైంది. సరయూ నది హిందూ రక్తంతో ఎర్రబారింది. మధురా బృందావనాలు పాడుబడ్డాయి. కాకతీయ స్వయం భూదేవుడు, విజయనగర విరూపాక్షుడూ భగ్నులైనారు. ఇలా దేశంలో ఆ మూల నుండి ఈ మూల వరకు ఎన్నెన్నో దేవాలయాలు ధ్వంసమైనాయి. అంతరంగాలను భక్తి తరంగాలకు పొరలిస్తూ ఏ శ్రద్ధా

కేంద్రాలను హిందువులు పరమ పవిత్రాలుగా, పరమేశ్వర నిలయాలుగా భావించే వారో, అట్టి శ్రద్ధా కేంద్రాల సర్వనాశనం తమకు ధార్మిక కర్తవ్యం అనే విశ్వాసంతో వరుసగా మహమ్మదీయులు హిందుత్వనాశనానికి ప్రయత్నం చేశారు. అలా హిందూ దేశంలో హిందూ శ్రద్ధా కేంద్రాలు నశిస్తున్నా సమాజంలోంచి పౌరుషాగ్ని బడబానలంగా లేచి శత్రు వ్యూహాన్ని భస్మీపటలం చేయలేక పోయింది. సహజంగా దీనితో ప్రజలలో ఆత్మ విశ్వాసం సన్నగిల్లేది. ఏ దేవతలు; పరమ శక్తిమంతులని, రాక్షస సంహారకులని, సాధువులను రక్షించడానికి పరుగెత్తుకొని వచ్చేవారని తాము భావించారో ఆ దేవతా మూర్తులు భగ్నము అవుతున్నా, ఆ శక్తి ఆవిర్భవించి శత్రు సంహారం చేయదెందుకు? అని సామాన్యులు వాపోయే వారు.

హిందూ స్త్రీ మాన గౌరవాలు జాతికి మహోన్నత శ్రద్ధా కేంద్రాలు. స్త్రీలు పూజింపబడనిచోట దేవతలుండరని హిందువుల విశ్వాసం. అలాంటి హైందవ స్త్రీలను, ఈ దురాక్రమణ దారులు, వారి వెంట వచ్చిన మూకలూ అవమానించని రోజులేదు. చిత్తూర్ దుర్గంలో పదునాల్గు వేల రాజపుత్ర స్త్రీలు, అల్లాఉద్దీన్ దుష్టబుద్ధినుండి తప్పించుకునేందుకు మహారాణియైన పద్మినితోసహా అగ్ని గుండంలో పడి ఆహుతి అయినారు. స్త్రీ ఆదిశక్తి. స్త్రీని రక్షించుకోలేని పురుషుడు పురుషుడేనా? ఆర్యస్త్రీ మానాన్ని నడివీధుల అపహరించే ఆ దుర్మార్గులను సంహరించడానికి రావణహంత శ్రీరాముడు కోదండపాణియై రాడెందుచేత? ఏడా శ్రీకృష్ణుడు- నరకాసురుని బారినుండి పదునారువేల రాజపుత్రికల ముక్తం చేసి, ముక్తి నిచ్చిన త్రాత?... అని విలపించేవారు సామాన్యులు.

గోవు కామధేనువు. భూమిః ధేనుః ధరణీ అని మనం స్తుతిస్తాం. ఇష్టకామ్యము లిచ్చేది గోవు. భూమికి గోవుకూ తేడా లేదు. భూమే గోవు రూపాన్ని ధరించింది. గోవు హిందూజీవనానికి ఆత్మ లాంటిది. గోశరీరము సమస్త దేవతలకూ నిలయం. అట్టి గోమాతని అపహరించ దలిచిన కార్త వీర్యార్జుని వేయి చేతులూ నరక లేదా పరశురాముడు ? కాని మహమ్మదీయులు గోవధను విధిగా పెట్టుకున్నారు. అది వారి మతానికి తప్పని ఆచారమా అంటే అదీకాదు. గోవు హిందూ ధర్మాచరణలో కేంద్రం లాంటిది. అట్టి గోవధను చేస్తే హిందూ ఆత్మను హత్యచేసినట్లే. అయినా హిందూ సమాజం మౌనం వహించింది. 'ఆ గోవులను పాలించిన గోపాలుడు, ఇంద్రుని శక్తిని ఎదిరించిన వాడూ, ఏడీ ఆ శ్రీకృష్ణుడు ?' అని ఎదురుచూచి విసిగేవారు మూగ ప్రజలు.

హిందూ ధర్మానికి వ్యాఖ్యాతలై, హిందూ ధర్మబీజాలను ప్రజలలో నాటుతూ, స్వధర్మాన్ని గుర్తుచేస్తూ ఉండిన పండితులను, విప్రులనూ నిర్బంధించి, వారిని సేవకులుగా పశువులను సంతలో అమ్మినట్లు మధ్యాసియాలో విక్రయించారు.

ఈ దేశంలో హిందువుగా గుర్తింపబడుతూ జీవించాలంటే పన్ను కట్టుకొని బ్రతకవలసి వచ్చింది. హిందువునకు తన దేశంలోనే మానం లేదు, గౌరవం లేదు, పౌరుషం లేదు.

ఈ దుస్థితి సమాజంలో అనేక రకాల విపరీతాలను సృష్టించింది. ధర్మనిష్ఠ తీవ్రంగా లేని వాళ్ళు ఎప్పటికప్పుడు ఎవరికో శరీరాన్ని, బుద్ధిని అమ్ముకొని జీవించే ఉదర పరాయణులు, కామినీ కాంచనాల కొరకు, పదవులకూ, కీర్తికీ ఎంతటి నీచానికైనా తలపడేవారు బలహీన

మైన మనస్సు శరీరం గలవాళ్ళు ఎప్పుడూ ఆయా సమాజాల్లో ఉంటారు అలాంటి హిందువులు మహ్మదీయుల కత్తిఝళిపింపులకు భయపడి వాళ్ళ ప్రలోభనాలకులోనై మహ్మదీయ మతంలో చేరిపోయినారు. ఇస్లాము మతంలో చేరిన హిందువు లందరూ ఏదో ఒక కారణాలవల్ల చేరిన అల్ప ప్రాణులే. చివరకు అలా చేరిన వాళ్ళందరూ పైనచెప్పిన దేశద్రోహులై, మాతృఘాతకులైనవాళ్ళే.

రాజెవరైతేనేమి? మనకు దిన వెచ్చం ముడితే చాలని సామాన్య ప్రజా, కొంత తలదించితేనేమి గనుక, మన ధనసంపదలు దక్కితేచాలు, మన జోలికి రాకుండా ఉంటే చాలు అనుకునే పెద్దలూ మౌనం వహించారు. రాజా మానసింహుకు, జయసింహ, యశ్వంత సింహులు తక్కువ వారా? మొగలు రాజ్యానికి మూల స్థంభాలు గదా ! తలచుకొంటే మొగలు శక్తిని కూకటివేళ్ళతో పెకలించి పారవేయగల సత్తువగల వాళ్ళు కదా ! కానీ స్వార్థం కొరకు తలవంచిన వారే. పై పెచ్చు తమ ఆలు బిడ్డలను, బలపౌరుషాలను అమ్ముకొని తమ పెద్దరికాన్ని, వైభవాన్ని నిల్పుకోవాలని ప్రయత్నించారు. శివాజీ తండ్రి స్వయంగా అలా తలదించిన వాడే. దక్షిణ నవాబులను ద్రేళ్ళ మీద నర్తింప చేసిన వీరుడాయన. వీరికి అంత శక్తి ఉన్నా సమాజాన్ని ఏకం చెయ్యాలి, పరాయి దాడుల్ని, పరాయి రాక్షసుల్ని వెళ్ళ గొట్టాలి, స్వరాజ్యాన్ని, స్వధర్మాన్ని నెలకొల్పాలి అనే భావం స్ఫురించలేదు. అంతేకాదు, స్వాభిమానంతో స్వత్వంతో నిల్చుని యుద్ధం చేస్తున్నవారికి వ్యతిరేకంగా శత్రువుతో చేరి జయించ బూనిన బానిసలు కూడా కాకపోలేదు.

సర్దారులూ, సైనికులూ, రాజులూ మాత్రమేకాదు, కవి పండితులు కూడా 'ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా' అని పాడుతూ తమ పబ్బం గడుపు కుంటే చాలుననే ఉదరమాత్రజీవులైనారు.

హిందువులలో ఐకమత్యం చెడింది. అపస్మారం పెరిగింది. జీవితం దినగండంగా తయారైంది. ఒకచేత కత్తి, ఒకచేత మతము గ్రహించి, బైటినుండి వచ్చిపడ్డ తెగలు ఒక్కొక్కప్పుడు తమలో తాము కలహించినా ఈ దేశప్రజల విషయంలో, ఈ దేశపు ధర్మ, సంస్కృతీ సంప్రదాయాల విషయంలో కొన్ని సందర్భాలు మినహాయిస్తే సమాన శత్రుత్వాన్ని ప్రదర్శించారు. కొన్ని శతాబ్దాలు అలా నడిచేసరికి ఈ దేశం అసలెవరిది? ఈ దేశానికీ మనకూగల సంబంధమేమిటి? ఈ దేశంలో ప్రభువులైన ప్రజ ఎవరు? ఎవరు మన వాళ్ళు, ఎవరు పరాయి వాళ్ళు? స్వజనులైన హిందువులు తిరిగి విజయాన్ని సాధించగలరా? స్వధర్మం, స్వరాజ్యం ప్రతిష్ఠించుకోగలరా? తిరిగి హిందువుల స్వాభిమానం కాలు నిలద్రొక్కుకొని బ్రతగ్గలదా? ఈ ప్రజను, ఈ ప్రజల ధర్మాన్ని, జీవనాన్ని కాపాడేదెవరు? అనే మీమాంస ప్రారంభమయ్యేంత దుర్గతి తటస్థమైంది.

శివాజీ జన్మించిన నాటికి పూర్వం ఈ మీమాంసలో సమాజం సంక్షోభంలో ఉన్నది. ప్రతి ప్రాంతంలోనూ, ఏదో ఒక అలజడి, కొంత కదలిక, కొన్ని యుద్ధాలు, కొంత విజయసూచన, కొంత సంచలనం కనిపిస్తూనే ఉండేవి. కొన్ని మహోజ్వలంగా ప్రకాశించిన ఉదాహరణలు కూడా ఉన్నాయి. నిరాశా నిస్పృహల మధ్యలో రామాయణ, భాగవతాదుల సంకీర్తనలు జరిపి, ప్రజలలో ధార్మిక భావ జాగృతికి ప్రయత్నాలు జరిగేవి. కాని ఇవన్నీ ఓటమిలో వెలువడ్డ ఆక్రోశాలుగా ఉండిపొయ్యేవి.

శివాజీ తండ్రి శహాజీ ఆదిల్షా దర్బారులో సర్దారుగా ఉండేవాడు. కొడుకు జన్మించగానే జిజాబాయిని, శివాజీని శివనేరి దుర్గానికి పంపి అక్కడ కుల పురోహితుడగు దాదాజీ కొండదేవ్ పరిరక్షణలో ఉంచాడు స్వధర్మ, స్వరాజ్య బీజాలు తల్లి జిజాబాయి, దాదాజీ గురుదేవుల దయవల్ల

శివాజీ ఎదలో నాటుకున్నాయి. వానికి జిజాబాయి భక్తిభావన, కొండదేవుల శిక్షణ నైశిత్యాన్ని చేకూర్చాయి.

శివాజీకి ఆదిల్షాహీ దర్బారులో ఏదో ఒక పదవి సంపాదించి పెట్టాలని తండ్రి శహాజీకి అనిపించింది. అతణ్ణి బీజాపూరుకు పంపించాడు. కాని దర్బారులో శివాజీ విదేశ విధర్మ ప్రభువుముందు తలవంచ నిరాకరించాడు. పైగా ఇంటికి వచ్చి సచేలస్నానం చేశాడు - శత్రుస్పర్శతో కల్గిన పాపాన్ని కడిగివేసుకోడానికి. అదే సమయంలో ఒక కసాయివాడు గోవును వధించడానికి తీసుకొని వెళుతుండగా దారిలో ఆ పసివాడైన శివాజీ తలపడి శౌర్యంతో కసాయివాని తల నరికి గోహత్యను వారించాడు. ఈ రెండు సంఘటనలూ అతని చిత్తవృత్తికి నిదర్శనాలై వెలిగాయి. అక్కడినుండి శివాజీ తన ఉద్యమాన్ని ప్రారంభం చేశాడు.

సమాజంలో నాటివరకు ఎవరో కొందరు రాజులూ, సర్దారులూ విదేశీయులతో తలపడుతుండేవారు. అదీ తమ స్వార్థంకోసం. ప్రజలలో స్వధర్మ, స్వరాజ్య భావాలు అంతరించాయి. కనుక రాజుల యుద్ధాలలో ప్రజలకు సంబంధం ఉండకపొయ్యేది. సమాజంలో పై తరగతికి చెందిన వారు పరమ స్వార్థులై ఉన్నారు. అలాంటి వారి జోలికి పోలేదు శివాజీ. వారి వెంటపడి సమయాన్ని వృథా చేసుకోలేదు. తానొక కొత్త సృష్టి చేయాలి. అందుకే గ్రామీణులు, ఆటవికులూ ఐన సాధారణ ప్రజలతో నేస్తం కలిపి వారిలో తన ఉద్యమ బీజాలను నాటాడు. అలా సైన్యాన్ని సమకూర్చుకుని ఇటు బీజాపూర్ సుల్తానును, అటు ఔరంగజేబును ఎదిరించి, క్రమంగా తన బలాన్ని పెంచుకొని, ఆ యిరువురినీ ఓడించి తన ప్రభావాన్ని ముద్రించాడు.

ఉద్యమ సాధనలో అతడు నిర్వహించిన కార్యం మహాద్భుతమైనది. ఓటమిని తప్ప గెలుపును ఊహించుకోలేని ప్రజలకాయన చూపిన నేర్పరి తనం సాధించిన విజయ పరంపర విశేషమైన ఆత్మ విశ్వాసాన్ని కల్గించాయి.

అదెలా సాధ్యమైంది ?

సమాజపు నాడిని శివాజీ గుర్తించాడు. మొదట్లో శివాజీని పిన్న పెద్దా అందరూ ఎదిరించారు. తండ్రి వ్యతిరేకించాడు. స్వదేశీయులైన చంద్రరావ్, శ్యామరావులు శివాజీని చంపడానికి ప్రయత్నించారు. పరిస్థితులతో సర్దుబాటు చేసుకుంటూనైనా సుఖాలను అనుభవించాలని అనుకునే ప్రతి వ్యక్తికీ శివాజీ ఉద్యమంలో ఒక దురహంకారమే కన్పించింది. బిజాపూరు సుల్తాను ఆ దురహంకారాన్ని అణచడానికి అఫ్జల్ ఖానును పంపి శివాజీని సజీవంగా పట్టితెమ్మన్నాడు. శివాజీకి ఈ వార్త తెలిసింది. ఆయన చలించలేదు. అఫ్జల్‌ఖాను దుర్మార్గుడు. కసితో శివాజీని సాధించడానికి వస్తున్నాడు. ఎలాగైనా శివాజీని తన వలయం లోకి రప్పించాలని అతని ఆశయం. శివాజీ రాయగఢంలో ఉన్నాడు. అఫ్జల్‌ఖాను ఆక్రమణకు వస్తున్నాడని తెలిసినా తొణకలేదు. దురాక్రమణపు దారిలో అఫ్జల్‌ఖాను సేనలు గ్రామాలను దగ్ధం చేశాయి. ప్రజలను ఊచకోత కోశాయి. దేవాలయాలను ధ్వంసం చేశాయి. స్త్రీల మానాలను హరించాయి. గోవులను చంపాయి. తుల్జాపూర్ భవాని ఆలయాన్ని భగ్నం చేశాయి. పండరీపుర దేవాలయాన్ని కీలమట్టం చేశాయి ఈ వార్తలు ఎప్పటి కప్పుడు శివాజీకి అందుతుండేవి. శివాజీ చలించలేదు. అఫ్జల్‌ఖాను "ఏడీ మీ రక్షకుడు?" అని గేలి చేశాడు. ప్రజలు 'గోబ్రాహ్మణ దేవతా పరిపాలకుడు ఆ శివాజీ ఏడీ?' అని రక్షణ కొరకు ఆక్రోశించారు. చివరకు విసిగి శివాజీ పిరికివాడన్నారు. టక్కరి అన్నారు. శివాజీ చలించలేదు. ప్రజల ఉద్రేకానికి

బలి కాలేదు. పేరుకు, అహంకారానికి, అవివేకానికి లోబడలేదు. పైగా తాను భయపడ్డట్టు నటించాడు. అఫ్జల్ ఖానుకు లొంగిపోవడానికి వస్తున్నా నన్నాడు. తరుణం వచ్చినప్పుడు రాక్షసకాయుడైన ఆ అఫ్జల్ ఖానును బలి యిచ్చి చరిత్రలో అనితరమైన, అనుపమానమైన విజయాన్ని సాధించాడు. స్వధర్మ, స్వరాజ్య ప్రతిష్ఠ ఉన్న దేశంలో వేలకొలది పండరీనాథులు, వేలకొలది భవానీ మాతలు వెలయగలరు. కాని ఆ రెండూ లోపిస్తే? చౌకబారు కీర్తి ప్రతిష్ఠలు కాదు. అతని లక్ష్యం విజయం. కీర్తి ప్రతిష్ఠలూ ఆయన కోరింది వ్యక్తిగత గర్వ తృప్తికాదు, రాష్ట్ర గౌరవ వైభవాలు.

ఏ ఆదిల్షా శక్తి శివాజీని అణచడానికి ఒంటికాలు మీద లేచిందో, ఆ శక్తి తెగి, చివరికి శివాజీ దయాదాక్షిణ్యాలకు అర్రులు చాచింది.

మొగలులు విదేశీ విఘాతక బుద్ధులూ క్రూరులేకాదు-శఠులు కూడా. శివాజీ సాధిస్తున్న విజయం వారికి కన్నెర్ర కలుగజేసింది. షయిస్తఖాను మొగలు సామ్రాట్టు ఔరంగజేబుకు మేనమామ. అనేక యుద్ధాలు గెల్చిన వీరుడు. అతనికి సహాయంగా యశ్వంత సింహుని జత చేసి, శివాజీని అణచడానికి ఔరంగజేబు లక్ష సైన్యంతో పంపాడు. మొగలు సేనలు అనేక కోటలు పట్టుకున్నాయి. పూనా శివాజీ రాజధాని. అది కూడా మొగ లుల వశమైంది. రెండేండ్లు మొగలులు హద్దులేని ఆగడాలు చేస్తూ విజయ గర్వంతో విహరించారు. విలాసాలలో మున్గి తేలారు. అలాంటి ఒక అర్ధ రాత్రి, రంజాన్ రోజుల్లో, చిమ్నాజీబాపూను వెంట తీసుకొని నాల్గు వందల జోదులతో శివాజీ పూనా కోటలో చొరబడ్డాడు. షయిస్తఖాను సారా మత్తులో, విలాసిమల కౌగిళ్ళలో, అర్ధనగ్నుడై పడి ఉన్నాడు. శివాజీ చేసిన మెరుపుదాడితో కోటలో భయంకరమైన కల్లోలం వ్యాపించింది. సేవకులు షయిస్తఖానును లేపారు. ఆ మొగలు సేనాపతి

మత్తును వదలించుకుని లేవకముందే శివాజీ విచ్చుకత్తితో విరుచుకుపడ్డాడు. చీకటిలో పారిపోతున్న షయిస్తఖాన్ చేతివ్రేళ్ళు - శివాజీ ఖడ్గానికి బలి అయ్యాయి. అంతే! శివాజీని జయించవచ్చిన ఆ మహా మొగలు సేన దిక్కులేని పక్షులవలె చెల్లాచెదరైంది. ఎలా కోటలో ప్రవేశించాడో శివాజీ! చీమ కూడా దూర వీలులేదే? ఎంతటి సాహసం ఇది! అలాంటి యోజనా బద్ధమైన సాహసాలే జాతుల చరిత్రల రూపాలను మార్చేవి. శివాజీ అలాంటి మహత్తర గాధను నిర్మించాడు.

ఔరంగజేబుకీ అవమానం భరించరానిదైంది. శివాజీని జయించ డానికి జయసింహుని పంపాడు. జయసింహుడు పరాక్రమశాలి. హిందువే! మొగలు సామ్రాజ్యానికి మూల స్థంభాలలో ఒకడు. అతనితో విరోధం తన స్వరాజ్య నిర్మాణ ప్రయత్నాలకు అంతరాయం కలుగజేస్తుంది అని శివాజీ భావించాడు. యుద్ధంలో ఉభయ పక్షాలలో నశించేది హిందువులే. కాగా మొగలుల శఠత్వాన్ని బద్దలు చేయాలి. అంతవరకూ వారిని నమ్మి నడిచిన హిందూ సర్దారులకు వారి నీచబుద్ధిని బట్టబయలు చేయాలి.

శివాజీ సంకటావస్థ ఏర్పడ్డప్పుడు సంధి అంగీకరించాడు. అది ఫలిస్తుందని కాదు. అదొక పాచిక. ఆగ్రా దర్బారులో ఔరంగజేబు దుష్ట బుద్ధిని ప్రత్యక్షంగా చూపి, మొగలుల న్యాయబుద్ధిని విశ్వసించి నడిచే హిందువుల మూర్ఖత్వాన్ని బ్రద్దలు చేసి, వారి సహకారంతోటే నాటక మాడి తప్పించుకొని వచ్చాడు. ఆగ్రా నుండి శివాజీ తప్పించుకొని రావడం ఒక మహాద్భుత వీరగాథ. ఆగ్రాకు వెళ్తూనే ఔరంగజేబు క్రోధాన్ని ఆకర్షించినవాడు; విచ్చు కత్తుల పహరాలో ఉన్నవాడు; అందరి కళ్ళలో దుమ్ముకొట్టి బైటపడి సుదూరమైన ఉత్తర భారతం నుండి దక్షిణా పథమునకు వచ్చి విజయ దుందుభి మ్రోగించాడంటే,

ఎంత జాగ్రత్త, ఎంత ఆలోచన నేర్పు, విజిగీష ప్రవృత్తులతో వ్యవహరించాడో బోధపడుతుంది. అంతేకాదు. ఆ మొత్తం వ్యూహం వెనుక ఎంత జాగృత ప్రయత్నం పనిచేసిందో. అది టక్కరి తనమా? కాదు. మొగలుల చేతిలో పడి చచ్చిన స్వదేశ భక్తుల జాబితాలో తానూ ఒకడు కావడం కాదు శివాజీ ఆదర్శం. శివాజీ మొగలులను గెలవదల్చుకున్నాడు. గెలిచాడు. ఆనాడు అదే అవసరమగు నీతి. రాణా ప్రతాప్‌లాంటివాడు సంధి ఎరుగని, స్వార్థం తెలియని వీర వ్రతమగు పరమ దేశభక్తి వ్రతాన్ని, ధర్మదీక్షను ప్రకటిస్తే అతని అడుగు జాడల్లో నడవడం పోయి - 'ఇంత చేసి సాధించేదేమిటి? ఏదో సర్దుకొని పోక పొడిచి గెలిచిందేమిటి?' అని ఉపేక్షించింది సమాజం. ఆ సమాజమే హిందూ సామ్రాజ్యాన్ని నిర్మించిన శివాజీని సాక్షాత్తు పరమేశ్వరుని అవతారంగా స్తుతించింది. శివాజీ లేకపోతే సర్వ భారతం మహమ్మదీయ మయమై పోయేదని పొగడింది. కారణం ఒక్కటే - శివాజీ గెలుపు! దాదాపు ఆరు శతాబ్దాల మధ్యకాలంలో స్పష్టంగా అంతవరకూ ఒక సర్వాంగణమైన స్వరాజ్య ప్రభుత్వ కల్పన కల్పించలేదు. స్వత్వానికి ప్రతిష్ఠ జరుగలేదు శివాజీ మహారాజు రాయబారులను నియమించాడు. సముద్రాన్ని శాసించాడు. విదేశీ-స్వదేశీ వ్యత్యాసాన్ని స్పష్టీకరించి ప్రకటించాడు. దానికొరకు నాటి పరిస్థితుల్లో శివాజీ ప్రతి చిన్న అవకాశాన్ని ఉపయోగించుకున్నాడు.

పాశ్చాత్యులు, పాశ్చాత్యుల ప్రభావంతో ఆత్మవిశ్వాసం కోల్పోయి భృతిభుక్కులైన ఉదర జీవులూ, శివాజీ అధర్మ యుద్ధం చేసిన వాడిని, దోపిడి గాడని, కొండ ఎలుక అని అన్నారు. అతడు దోచిందెవరిని? ఎవరి పట్ల కౌటిల్యం ప్రదర్శించాడు? విదేశీ దురాక్రమణదారుల ధర్మం వేరు, ఆశయం వేరు; శివాజీ ధర్మం వేరు, ఆశయం వేరు. నీతి అవినీతులను

కొలిచే ప్రమాణాలు వేరైనప్పుడు జయాన్ని చేపట్టడానికి అవలంబించే ప్రతి మార్గమూ ధర్మమే. కనీసపు మానవత్వపు విలువలు గుర్తించక, ఒక ప్రజ హృదయ పూర్వకంగా ఆరాధించే దేవాలయాలను, స్త్రీల మానాన్ని, గోవులను, విద్వాంసులను ధ్వంసం చేయడం ముక్తి అనుకునే వర్గాన్ని, వారి అసహిష్ణుతను తుడిచిపెట్టడానికి శివాజీ ప్రతి అవకాశాన్ని వినియోగించుకున్నాడు. వారి ఖజానాలు దోచాడు. ఎక్కడిదా ధనం? అదెలా పరాయివారైన శత్రువుల కైవసం అయింది? మనపై చేసిన దోపిడీ, దురాక్రమణల వల్లనే కదా? దాన్నెందుకు ఉపయోగించారు శత్రువులు ఈ దేశాన్ని నాశనం చేయడానికే కదా? అలాంటి వారి నుండి, ఆ స్వదేశ ధనాన్ని వశపరచుకొని దాన్ని స్వధర్మ స్వరాజోద్యమానికి శివాజీ వెచ్చించాడు. అది ధర్మం కాదా?

శివాజీ యుద్ధాలను కూడా మూర్ఖంగా చేయలేదు. అవసరమనుకున్నప్పుడు సంధి కోరాడు. స్వార్థపరుడై కాదు-అవకాశం లభించడానికి, బలం పుంజుకోడానికి. అలా వీలయినప్పుడల్లా ఎదురు దెబ్బతీశాడు. వీలు చిక్కకపోతే పారిపోయినాడు మూర్ఖంగా మిడతల దండులా తన సేనను ఎదుటి బలానికి ఆహుతి చేయలేదు ఎటుపోయీ విజయం లభించాలి. అదీ అతని లక్ష్యం! గెలుపంతటి గెలుపు మరొకటి లేదు. గెలుపును సాధించడానికి అతను స్వీకరించిన సాధనా లెటువంటివనేది కాదు ప్రశ్న. శక్తికీ, గెలుపుకూ ప్రపంచం తలవంచుతుంది. అదీ శివాజీ గుర్తించిన సత్యం. అందుకే సమర్థ రామదాసు "శివాజీని స్తుతించండి, శివాజీని అనుసరించి నడవండి'' అని ఉద్బోధించాడు.

ఆ సత్యాన్ని గుర్తించి, స్వధర్మ, స్వరాజ్య భావనతో సాధారణ మానవుల్లోంచి మహాతేజశ్శీలురైన యోధాన యోధులను శివాజీ సృష్టిం

చాడు. నేతాజీ పాల్కర్, తానాజీ మాలసురే, సూర్యాజీ, ప్రతాప్‌రావ్ గుజర్, బాజీప్రభు దేశపాండ్యా, ఖండోజీ భల్లాల్, శంభాజీరావ్‌జీ, జీవాజీ మహతా లాంటి పరమ దేశభక్తుల వెల్లువ పొంగింది. పశ్చాత్తాపం కన్పించిన చోట, ఇతరులలో కలిసి స్వధర్మాన్ని మార్చుకున్న వారిని కూడ తిరిగి స్వసమాజంలో చేర్చుకొని వారికి శ్రేష్ఠస్థానాన్ని ఇచ్చాడు. తనకంటే, తన వ్యక్తిగత మమకారం కంటే దేశం గొప్పదని ఆచరణలో ఋజువు చేశాడు. సాక్షాత్తు తన తండ్రిని బీజపూర్ ప్రభుత్వం బందీ చేసినప్పుడు తండ్రి ఉత్తరం వ్రాశాడు - నీవీ ఉద్యమాన్ని ఆపకపోతే నా జీవితం దక్కదని శివాజీ వ్యక్తిగతంగా బాధపడ్డా ఈ మహా ఉద్యమంలో ఎందరు తండ్రులు ఆహుతులైనారో, ఎందరింకా కావాలోనని ప్రకటించాడు. తన కుమారుడు శంభాజీ దుర్మార్గుడై కుట్రపన్నితే ఖైదులో పెట్టడానికి భయపడలేదు. మహమ్మదీయులను మట్టి గరపించినా, మసీదుల జోలికి, వారి ధార్మిక భావనల జోలికిపోలేదు. విజయ పరంపర లభించినా గర్వపడలేదు. జయసింహుని సంబోధిస్తూ "నీవు స్వయంగా దక్షిణాన్ని జయించవస్తే, నీ గుఱ్ఱాన్ని కళ్ళెం పట్టుక నడిపించి, సమస్త దక్షిణాపథాన్ని నీ కాళ్ళ ముందు సమర్పించేవాణ్ణి. కాని నీవు గులాము వై వచ్చావు" అని ఉపాలంభించి, చేవచచ్చిన హృదయాలలో జాతీయ స్వాభిమానాన్ని అంకురింపచేశాడు.

శివాజీ ఈ ఉద్యమాన్ని తనకై నిర్మించలేదు. అందుకే వ్యక్తినిష్ఠమైన ఉద్యమాన్ని, వ్యక్తి పూజారులను నిర్మించలేదు. అఫ్జల్ ఖానుతో పోరాడటానికి బయలుదేరి నప్పుడూ, షయిస్తఖానుతో తలపడ్డప్పుడూ, ఆగ్రాకు వెళ్ళినప్పుడూ, రాజ్యవ్యవస్థను, ఉద్యమ వ్యవస్థను నిరాటంకంగా పురోగమింప చేసే పూర్తి ఏర్పాటు చేశాడు. తాను లేకపోయినా స్వధర్మ స్వరాజ్య ఉద్యమాలు నడిపించగల నీతి విశారదులను, వీరయోధులను నిర్మించి, ప్రతి తడవముందే ఏర్పాట్లు చేసి ఉంచేవాడు.

తను తలపెట్టిన పని రాష్ట్రీయ కార్యం, దాని కడ్డు తగిలిన తండ్రిని లెక్క చేయలేదు. స్వజాతీయులైన చందర్ రావును సంహరించాడు. పుత్రప్రేమను త్రెంచుకొని, శంభాజీని నిర్బంధంలో ఉంచాడు. వ్యక్తిని అతడు కొలిచింది ధర్మబుద్ధితో.

శివాజీ అలా ఒక చక్కని సంఘటన కర్తగా సమాజంలో విజిగీషు ప్రవృత్తిని రగులుకొలిపాడు. తూచితూచి అడుగులేస్తూ అల్ప కాలంలో మహోద్యమాన్ని నెలకొల్పి, ఆ ఉద్యమ ఫలితమైన స్వరాజ్యానికి రాజుగా అభిషిక్తుడైనాడు. అది ఆనాటి ప్రజల మనస్తత్వాన్ని మరల్చి, స్వజాతీయాభిమానాన్ని రగులు కొలిపేందుకే.

నాటి ఉత్సవాన్ని చూచి తరించడానికి లక్షల ప్రజలు రాయగఢానికి వచ్చారు. సమస్త నదుల జలం తరలి వచ్చింది. సమస్త వేదశాఖలు వల్లించే విప్రుల కంఠాలు ఉద్ఘోషించాయి. స్వాధీన హైందవ శక్తి విరాట రూపాన్ని సాక్షాత్కరించుకొన్నది.

శివాజీ ప్రారంభించిన ఈ ఉద్యమం క్షణికం కాదు. బుద్బుదం లాంటిది కాదు ప్రతిక్రియాత్మకం కాదు. కనుకనే అతని తరువాత రాజులు ఎటువంటి వారు వచ్చినా ఉద్యమం ఆగలేదు. అటక్ నుండి కటక్ వరకు యావద్దేశములో స్వరాజ్య ప్రతిష్ఠ ఏర్పడ్డది. మహ్మదీయ ప్రభుత్వపు బానిస సంకెల తెగించి.

అలా స్వదేశం, స్వధర్మం, స్వరాజ్యం అనే త్రిపుటిని మరచిన జాతిని తిరిగి ఆ త్రిపుటిని సాక్షాత్కరించుకునేట్టు చేసినవాడు శివాజీ. సురాజ్యం కాదు, ఏదో రాజ్యం కాదు - స్వరాజ్యం. ఆ స్వరాజ్యం, స్వధర్మం - ఇవీ మన ఆదర్శం అని చాటిన రాష్ట్ర ద్రష్ట, రాష్ట్రీయతను వ్యాఖ్యానించి, సాక్షాత్కరింప చేసుకొన్న పౌరుషమూర్తి శివాజీ.

సంఘ యుగం ఇది. ఈనాటికీ నాటికీ సామ్యాలు అనేకం. ఆంగ్లేయులు గుఱ్ఱాన్ని, గాడిదను ఒక గాట కట్టివేశారు. ఈ దేశం హిందువులది. హిందువులు మేల్కొంటే ప్రపంచంలో వీరొక ప్రచండశక్తిగా రూపొందుతారు. కనుక కుట్రతో హిందూ ముస్లిం సమస్యను సృష్టించారాంగ్లేయులు. ఆ సమస్యకు దాసోహమంటూ లొంగిపోయారు మన పెద్దలు. చరిత్రలో మొదటిసారిగా మన చేజేతులా మాతృదేవి శరీరాన్ని ఖండించుకునే దుర్దశకు దేశాన్ని తెచ్చారు. తమ తప్పిదాన్ని గుర్తుచేసి, తిరిగి సవరించడానికి ఎవరైనా పూనుకుంటే తమ పేరు చరిత్రలో కళంకంగా మిగిలిపోతుందనే భయంతో ''విభజన స్థిరము వాస్తవం'' అని వక్కాణించి, కాదన్నవారిని ఉపాలంభించి తమ సర్వశక్తినీ వినియోగించి, పరాభవించడానికి సంకోచించలేదు.

హిందూదేశ స్వాతంత్ర్యం అంటే ఎవరి స్వాతంత్ర్యం? ఇక్కడ రాష్ట్రీయ సమాజం ఎవరిది? స్వరాజ్య స్వధర్మాలకు ఈ దేశంలో అర్థం ఏమిటి? శివాజీకాలంలో ఏ విధంగా కలగూరగంప భావాల మనస్తత్వం వ్యాపించిందో, అదే మనస్తత్వం నేడూ కన్పిస్తున్నది. నాడు వ్యాపించియుండిన సర్దుబాటు ప్రవృత్తి నేడూ కన్పిస్తున్నది. సమానమనస్తత్వాలు, సమాన చరిత్ర, సమాన అభిమాన కేంద్రాలు, సమాన సమాజ జీవన బంధాలు లేని ప్రజలను సమీకరించే వ్యామోహంలో, దేశంలో బలమైన శ్రద్ధాకేంద్రాలుగా నిలవగల 'స్వధర్మ, స్వరాజ్య' తత్వాలకు పెడర్థాలు చెపుతున్నారు.

ఫలితంగా సమాజానికి విశ్వాస కేంద్రం లేకుండా పోయిందీనాడు. శివాజీకి పూర్వం సమాజంలో ఎలాంటి హీనస్థితి కన్పించిదో నేడలాంటిదే కన్పిస్తున్నది.

మన పదవులు దక్కితే చాలనుకునేవారు కొందరు, మన సంపద పెరిగే అవకాశం ఉంటే చాలనుకునే వారు కొందరు, మనకెందుకులే అని తలదించుకునేవారు కొందరు. హిందూ సమాజం ప్రాంతాల పేరిట, వర్గాల పేరిట, కులాల పేరిట, రాజకీయ స్వార్థాల పేరిట ముక్క చెక్కలై మైమరచి ఉన్నది.

విజిగీషు ప్రవృత్తిలేదు, సమిష్టి భావంలేదు, సమాజ హితాన్ని దిగమ్రింగే స్వార్థం వ్యాపించి ఉన్నది. క్రైస్తవ, ముస్లిం మత వర్గాలూ కమ్యూనిష్టు వగైరా అరాష్ట్రీయ వర్గాలూ దేశంలో పెద్ద పీటల మీద కూర్చుని ఉన్నాయి. హిందూ దేశంలో హిందూ ప్రజ పరాయి బ్రతుకు బ్రతికే స్థితి తటస్థించింది. 'హిందూ' అనే స్ఫురణ కలుగచేసే ప్రతి విషయమూ మతోన్మాద మవుతున్నది. దీనికి కారకులెవరు? హిందువులే. చదువుకున్నవారే. వ్యక్తిగత విషయం వచ్చినప్పుడు పరమ స్వార్థులై, విలవిల తన్నుకునైనా తమ పని కూర్చుకునేవారు సమాజ విషయం వచ్చేటప్పటికి మహా ఉదారుల్లా విఘాతుక భావాలను ప్రకటిస్తున్నారు.

అలాంటి సమాజంలోంచి తిరిగి సంఘటన శక్తిని ఉదయింప చేయాలి. శివాజీని స్వజనమే ఎదిరించింది. మనను ఎదిరించేదీ స్వజనమే. శివాజీ ఎదిరించింది విధర్మ, పరతంత్రాలను. నేడు మన మెదిరిస్తున్నదీ అలాంటి విధర్మ భావాలనే, పారతంత్ర్య ప్రవృత్తులనే. శివాజీ స్వరాష్ట్ర సంఘటనకు ఉద్యమం నడిపాడు. మనము చేస్తున్నదీ అదే కార్యక్రమము. సమయం వేరైనా, వ్యక్తులు వేరైనా, సంఘటనలు వేరైనా ఈ రెండు సమయాలలో ఉండిన మన సత్వాలూ, సంఘర్షణ కారణాలు ఒక్కటే. శివాజీ జీవన కార్యం రాష్ట్రీయ పునర్జాగరణ ఉద్యమం. ఈ దేశంలో రాష్ట్రీయులంటే హిందువులే, పైనుంచి వచ్చిన వారంతా పరాయివారే అనే నిష్కర్షను శివాజీ తన జీవన కార్యంద్వారా ప్రకటిం

చాడు. పారతంత్ర్యం కేవలం భౌతిక స్థితివరకే పరిమితంకాదు. ఏవిధంగా రాజకీయంగా దేశాన్ని విదేశీ శాసన బంధనాలనుండి ముక్తంచేసి ప్రజలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ఇవ్వడం రాష్ట్ర ధర్మనమో, అదేవిధంగా అక్రమాల కారణంగా, బలిమిని, కామినీ కాంచనాల మోహంతో తమ సంస్కృత సభ్యతాదులనుండి, స్వధర్మ, స్వదేశీ వ్యవహార సదాచారాల నుండి దూరమైన ప్రజలకు సాంఘిక, ధార్మిక స్వాతంత్ర్యాన్ని లభింప చేయడానికి, అలా మారిన జనాన్ని స్వజనంలో కలుపుకోడానికి ఉద్యమించాలనే భావాన్ని శివాజీ చాటిచెప్పాడు. ఆత్మవిస్మృతి కలిగిన జాతికి సనాతనమైన స్వధర్మ, స్వరాజ్య ఆదర్శంద్వారా స్వరాష్ట్ర స్ఫూరణ కల్గింప చేశాడు. పరమ పూజనీయ డాక్టర్‌జీ సంఘాన్ని స్థాపించింది ఆ స్వరాష్ట్ర స్ఫూరణ కల్గిన మహా సంఘటనను నిర్మించడానికే. శివాజీ శక్తిని ఉపాసించాడు. సంఘమూ శక్తినే ఉపాసిస్తున్నది. అందుకే శివాజీ మన కాదర్శపురుషుడు.

అందుకే శతాబ్దాల దాస్యబంధాలనుంచి దేశానికి విముక్తి కల్గింప చేసి, శివాజీ స్వశక్తితో హిందూ సామ్రాజ్యానికి అధిష్ఠాతగా అభిషిక్తుడైన జ్యేష్ఠ శుద్ధ త్రయోదశిని జాతికి పర్వదినంగా డాక్టర్‌జీ ప్రకటించారు. ఆ దివ్యమూర్తి అడుగుజాడలలో ఆసేతు హిమాచలం వ్యాపించి వున్న హిందువులను ఒకే సంఘటిత శక్తిగా రూపొందించడానికి నిర్మలమైన, విశుద్ధమైన రాష్ట్రభక్తిని ప్రబోధించారు. శివాజీ పట్టాభిషేక దినోత్సవ మందుకే హిందూ సామ్రాజ్య దినోత్సవంగా రాష్ట్ర జాగరణ మహోత్సవంగా జరుపుకుంటూ, ఆయన గుణగణాలను ప్రజలలో కలుగజేయడానికి రాష్ట్రీయ స్వయంసేవక సంఘం ప్రయత్నిస్తున్నది.

# గురుపూజ

మన ధర్మం ఈ జన్మలో నల్గురు జంగమదేవతలను చూపించింది. తల్లి, తండ్రి, గురువు, అతిధి - ఈ నల్గురు ప్రత్యక్ష దేవతలు. మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ.

అందులో గురువు అంటే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఒక్కటై జన్మించిన రూపం. అనగా సాక్షాత్తూ పరబ్రహ్మ స్వరూపమే గురువు. మనకు మన జీవభావానికి అంకెలాంటివాడు.

అందుకే గురుపూజకు మన దేశంలో అంత ప్రాధాన్యం. ఆషాఢ పూర్ణిమను గురుపూర్ణిమగానూ, వ్యాసపూర్ణిమగానూ వ్యవహరించే పరిపాటి మనదేశంలో ఉన్నది. భగవాన్ వేదవ్యాసుడు కలియుగానికి ధర్మబోధ నిమిత్తం, వేదాలను నాలుగుగా వర్గీకరించాడు. అష్టాదశ పురాణములను, ఉపపురాణములను, భారత భాగవతాదులను ప్రవచించాడు. బ్రహ్మసూత్రాలను వ్రాసి, ఆర్షధర్మానికి ప్రధానమైన సేవ చేశాడు.

వ్యాసుడొక వ్యక్తికాదనీ, వ్యాసపీఠం ఒక వ్యవస్థ అనీ, ప్రస్తుతం మనం ఎరిగిన వ్యాసుడు 28వ వ్యాసుడనీ, వ్యాసపదానికి "విస్తారో, విగ్రహో వ్యాసః" వేద పురాణాలను విపులీకరించినారుగాన వ్యాసులై వ్యవహృతులైనారని కొందరు అంటారు.

మనం ఎరిగిన వ్యాసుడు సత్యవతీ పరాశరులకు గంగ ద్వీపంలో జన్మించాడు. సత్యవతీ పుత్రుడు గాన సాత్యవతేయుడన్నారు. నల్లనివాడు గనుకనూ, ద్వీపమున జన్మించినవాడు గనుకనూ కృష్ణద్వైపాయనుడైనాడు. పరాశరుని పుత్రుడుగాన పారాశారి, పారాశర్యుడన్నారు. బద

రికా వనంలో నివసించి తన జీవన కార్యమైన ధర్మ ప్రచారం చేసినాడు గాన బాదరాయణ ఋషి అయినాడు. వ్యాసపదం గురుపదానికి మారుగా వాడే పరిపాటి కూడా ఉన్నది.

'వ్యాసం వశిష్ఠ నప్తారం శక్తేః పౌత్ర మకల్మషం॥
పారాశరాత్మజం వందే, శుకతాతం తపోనిధిరణమ్' అని వ్యాసుని నేటికీ స్తుతిస్తున్నాం. సూర్యుడు జ్ఞానస్వరూపుడు, చైతన్యస్వరూపి. చంద్రుడు మననరూప క్రియాస్వరూపుడు. సూర్యచంద్రులిద్దరికీ ప్రధాన దేవత పూర్వాషాఢ నక్షత్రము. ఆషాఢ పౌర్ణమినాడు చంద్రుడు సంపూర్ణ కళాశోభితుడుగా ఉంటాడు. ఆనాడు సూర్యుడు తన సర్వకాంతులతో చంద్రున్ని ప్రకాశింపజేస్తాడు కాన ఆనాడు సంపూర్ణంగా మనస్సుకు బుద్ధికి ప్రకాశం లభిస్తుంది. ఆరోజున గురువును పూజించి కర్తవ్యమార్గాన నడవడానికి సంకల్పించడం పరిపాటిగా అనాదినుండి మన దేశంలో వచ్చింది.

హిందువులు సంస్కారజీవులు. మాతృగర్భంలో ప్రవేశించిననాటి నుండి, జన్మించి, జీవించి ఈ పంచభూతములతో ఏర్పడ్డ శరీరాన్ని తిరిగి పంచభూతాలకు అప్పగించేవరకు నిత్యమొక సంస్కారముగ జీవించే వ్యవస్థ మనది. బ్రతికున్నంతవరకు ఈ జీవితాన్ని ఆదర్శమయంగా నడిపి చివరికి పరమేశ్వర పదం పొందడము మన లక్ష్యం. దీనికి ధర్మార్థ కామ మోక్షాల కొరకు నడిచే బాటలో దారి తప్పకుండా జ్ఞాన జ్యోతిని ధరించి, చీకట్లను తొలగించి, మనను నడిపే ఒక ఆధారం, ఒక మార్గదర్శి, ఒక గురువుకావాలి. జీవనయాత్రలో కర్తవ్యమేది - ఏది కాదు; ఏది సత్యం, ఏదసత్యం; ఏది ధర్మం - ఏదధర్మం అనే సంశయం ఏర్పడి, కింకర్తవ్యతా విమూఢులమై ఉన్నపుడు మన నావరించిన సంశయాన్ని తొలగించి నడిపించే గురువొకడు అవసరమైనపుడు, ఆ అవసరానికి తగినట్లుగా నడిపించగల స్ఫూర్తిరూపుడైన గురువు లభించాలి కదా!

రాష్ట్రాత్మను గుర్తించి, రాష్ట్రీయ ప్రవృత్తుల ఐహికాముష్మిక పరమార్థాలను బోధిస్తూ, సంశయం వచ్చినపుడు దోషాతీతుడయి తన పరమ స్వచ్ఛమైన జీవన ఉదాహరణతో సంశయ విచ్ఛేదం చేయగల గురువు లభించడం సాధ్యంకాని విషయం. ఎవరో ఒక వ్యక్తిని గురువుగా వరిస్తే, ఆ వ్యక్తి తన మనస్సు వాక్కు, కర్మలతో, అన్ని సమయాలలో, అన్ని సందర్భాలలో మన కాదర్శంగా ఉండగలుగుతాడా? భూత భవిష్య ద్వర్తమానాలను, దేశకాలపాత్రలను, తగిన మార్గదర్శనం మనకు అలా లభించడం సాధ్యమా?

సంఘం సంశయాత్మకమైన పునాదిపై రాష్ట్ర పునర్నిర్మాణం చేయదలుచుకోలేదు. మన మార్గంలో ఆదర్శంగా, మన కగ్రగాములుగా ఉన్న మహాపురుషులు అనేకులున్న మాట వాస్తవమే. తమ జీవన సర్వస్వాన్ని రాష్ట్ర యజ్ఞంలో ఇంధనాలుగా వేల్చిన ఆ ఆదర్శమూర్తులు మనకు నిరంతరం ఉత్సాహాన్ని, స్ఫూర్తినీ ప్రసాదిస్తూనే ఉంటారు. వారిచ్చిన వెలుగుబాటల్లో మనం నడుస్తూనే ఉంటాం. ఎంతైనా వ్యక్తి సర్వతోముఖంగా దోషాతీతుడుగా ఉండగలడా ? దోషాతీతుడుగా ఉండ గలిగినా, సర్వకాల సర్వావస్థల్లో సర్వ పరిస్థితులకు సమాధానం లభింప చేయగలడా ? వ్యక్తి జీవనం పరిస్థితులచేత ప్రభావితం కదా ! వ్యక్తి చరిత్ర కూడా అలాగే సమయానికి పరిమితం కదా !

అందుచేత మన ధర్మాన్ని, మన సమాజాన్ని, మన రాష్ట్రాన్ని, ఈ యుగాల మహా ప్రయాణంలో అమృతంగా, చిరంజీవిగా ఉంచడానికి ఏ మహనీయ తత్వం ప్రేరణనిస్తూ వచ్చిందో ఆ తత్వాన్ని ఆశ్రయించ డమే, ఆ తత్వాన్ని గురువుగా పెట్టుకోవడమే ఉత్తమ పద్ధతి.

మనది భారతీయ సంస్కృతి. మన సంస్కృతి త్యాగ వైరాగ్యాలకూ, జ్ఞానోపాసనకూ ప్రాముఖ్యం ఇచ్చింది. దరిద్రుడైనా సేవావ్రత నిష్ఠుడైతే ఈ దేశంలో పూజ్యుడు. ప్రపంచంలో ఒక చోట శక్తి, మరొక చోట ధనం మానవాదర్శాలైనాయి. కాని మన దేశంలో కేవలం ధన బలాలకు మాత్రమే ప్రాధాన్యం యివ్వబడలేదు. ఇక్కడ సౌశీల్యానికీ, త్యాగ వైరాగ్యాలకూ ప్రాముఖ్యం ఇచ్చారు. ఈ గుణాలను ఆర్జించి సామ్రాట్టులు సహితం ధన్యులయ్యేవారు. ఈ భౌతిక ప్రపంచంలో సౌశీల్యంతో, జ్ఞాన వైరాగ్యాలతో, కర్మమయ జీవనం గడిపి అనంతరం ఆముష్మికపదం కోరడమే జీవన లక్ష్యంగా మన తత్వం బోధిస్తున్నది.

కాని తత్వం నిరాకారమైనది. మన కంటికి కన్పించనిది. సమాజంలో సహజంగా వుండే ప్రతి వ్యక్తికీ స్ఫురించడానికి సాధ్యం కానిది. కనుక ఆ తత్వానికి, తత్వాన్ని ఆశ్రయించి పుట్టి పెరిగిన ధర్మ సంస్కృతీ జీవనాలకూ చిహ్నంగా ఉండేదీ, ప్రతి నిత్యమూ మన కన్నులకు కన్పించేదీ, యుగ యుగాల నుంచి మన రాష్ట్రానికి ఆత్మగా, మన రాష్ట్ర ధర్మ సంస్కృతీ సభ్యతలకు చిహ్నంగా, మన జీవనానికి ఆలంబనంగా వెలుగొందిన కాషాయ ధ్వజాన్ని, భగవా ధ్వజాన్ని మనకు గురువుగా ఎంచుకున్నాం.

ఈ కాషాయ ధ్వజం భారత జాతికి చిహ్నం. దీన్నెవరూ కాదనలేరు. భాషలు వేరు కావచ్చు. పద్ధతులు వేరు కావచ్చు, కాని దేశమంతటా మన ధర్మానికి, మన రాష్ట్రాత్మకూ కేంద్రాలైన ప్రతి మందిరంపైనా, తీర్థరాజంలోనూ ఈ కాషాయ ధ్వజం ఎగురుతూ కన్పిస్తుంది. హిమాలయంలో ఉన్న అమరనాథక్షేత్రంనుండి ఇటు కన్యాకుమారివరకు ప్రతి చోట ఈ ధ్వజం రెప రెపలాడుతూ వుంటుంది.

ఈ రంగంలో విశిష్టత వున్నది. మన రాష్ట్రంవలె ఈ రంగును చూస్తే ప్రతిహిందువులోనూ ఒకేవిధమైన ఆదరభావం పుడుతుంది. ఇది మన సమైక్యతకు సజీవ చిహ్నం. ఈ రంగు ఏదో ఒక ప్రాంతానికి పరిమితంగాక, అన్ని ప్రాంతాలలోనూ సమానంగా పూజింపబడేదే. ఒక ప్రాంతంవారికి రంగులో ఎలాంటి త్యాగ వైరాగ్యం జ్ఞాన పవిత్రతలు కర్మమయ జీవనం స్ఫురిస్తాయో, ఆ రంగు ధరించునవ్యక్తి పాదధూళిని శిరసున ధరించాలనే భావం ఎలా పుడుతుందో, అలాగే అన్ని ప్రాంతాల వారికీను.

ఈ రంగును ధరించిన వ్యక్తులు సన్యాసులు. బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థాల తర్వాత సన్యసించి, జ్ఞానం పొంది, ఆ జ్ఞానాన్ని ఇతరులకు పంచి, సిద్ధిపొందుతారు. సన్యాసం చక్రవర్తి పదాన్ని మించినట్టిది. కనుకనే కోట్లుగడించినా, సామ్రాజ్యాలు స్థాపించినా, చివరికి అన్నీ వదలి, కాషాయం కట్టి, తీర్థయాత్రలు చేసి తరింపచూస్తారు. ఇలాంటి వ్యక్తుల తపస్సువల్ల, కర్మమయ జీవనం వల్ల, దేశమంతటా ధర్మశ్రద్ధ, సంస్కృతీ సామరస్యం ఉత్పన్నమయింది. ఎటుచూచినా రెండువేల మైళ్ళ పొడవు గలిగిన ఈ విశాల భూమిలో కోటానకోట్ల ప్రజలు నివసించే ఈ పుణ్యభూమిలో, ప్రారంభమెరుగని ప్రాచీన చరిత్ర కలిగిన ఈ కర్మభూమిలో, సమరసభావాన్ని, సమైక్యతను పెంచి, పోషించిన దీసన్యాసులే.

> తీర్థాశ్రమ వనారణ్య గిరిసాగర పర్వతాః
> సరస్వతీ, పురీచైవ భారతీచ దశక్రమాత్॥

ఈ సన్యాసులు కూడా ఎన్నో రకాలు. కొందరు తమ కార్యక్షేత్రంగా పునీతములైన తీర్థక్షేత్రాలను ఎంచుకున్నారు. కొందరాశ్రమాలలో, కొందరు వనములలో, అరణ్యములలో, కొందరు గుట్టలలో, సాగర తీరములలో, కొందరు పర్వతములతో, కొందరు విద్వాంసులతో, పుర

వాసులైన నాగరకులలో, కొందరు యావద్భారతములో పర్యటిస్తూ ఈ సంస్కృతీ ధర్మాల పవిత్ర సందేశాన్ని ఇచ్చారు. కాషాయవస్త్రధారులై దండకమండలాలతో, కఠోరమైన జీవనం గడిపే ఈ సన్యాసు లెవరో? పూర్వాశ్రమంలో వీరి పేరేదో? ఎందరు రామతీర్థులు, ఎందరు విద్యారణ్యులు ఎదరు దయానంద సరస్వతులు అలా తమ తపోగంగను ప్రవహింపజేశారో!

వీరొకచోట వుండ వీలులేదు. మూడురోజులకొక మారు ఊరు మారాలి. కాలినడకే ప్రయాణసాధనం. "కరతల భిక్షా, తరుతలశయ్యా" అనే ధర్మంతో ఏ మధ్యాహ్నమో, ఎవరైనా ఆదరించి బిక్షపెడితే అదే తిని, ఏ చెట్టునీడనో నిద్రించి, ప్రజలను సేవించిన ధన్యులు. ఇలాంటి కఠోర వ్రతధారులైన సన్యాసులు మన సంస్కృతిని, మన ఏకాత్మ జీవనాన్ని నిర్మించారు. మన తత్వానికి సగుణ సాకార రూపాన్ని ప్రసాదించారు. ఇంతటి మహత్తర సంస్కృతీ విజయాన్ని సాధించినా, పేరు కోరుకోని నిస్సంగులు, నిర్మోహులు. అలాంటివారి త్యాగ వైరాగ్యాలకు చిహ్నం ఈ కాషాయం. అందుకే రాష్ట్రమంతటా ఈ రంగుకంత గౌరవం. సంఘాన్ని, రాష్ట్రాన్ని స్ఫూర్తినిచ్చి నడిపించేది ఈ ధ్వజమే.

మన ధర్మం సముత్కర్ష నిశ్శ్రేయస్సులను సమన్వయించింది. వీతరాగులై, జనసేవకులై, ధర్మప్రచారకులై, దేశాన్ని తమ ఇల్లుగా భావించి చరించిన సన్యాసులకు మనదేశం ఎంత గౌరవం ఇచ్చిందో, అంతే గౌరవం యుద్ధభూమిలో ధర్మప్రతిష్ఠకై పోరాడి నిలిచిన వీరులకు కూడ ఇచ్చింది అందుకే.

ద్వా వివౌ పురుషౌలోకే, సూర్యమండల భేదినౌ
పరివ్రాడ్యోగ యుక్తశ్చ, రణే చాభిముఖోహతః॥

అని మన పూర్వులు ప్రకటించారు. సూర్యమండలాన్ని కూడా ఛేదించగల పురుషులు రెండు రకాలే. ఒకరు సన్యసించి యోగులైనవారు.

మరొకరు యుద్ధభూమిలో శత్రు సంహారంచేస్తూ అసువులర్పణ చేసినవారు. అలా ఇహపరాలకు, పరమోచ్ఛ స్థితులకు సమన్వయాన్ని సాధించింది కాషాయమే. ఉదయిస్తున్న బాలసూర్యుని కాంతిపుంజాన్ని గుర్తుకు తెచ్చేది, జీవలోకానికి జ్ఞానాన్ని, ప్రఖరతేజాన్ని ప్రసాదించేవాడు సూర్యుడు. సన్యాసి జ్ఞానానికీ, వీరుడు ప్రఖర తేజానికి కర్తలు. వీరువురూ సమానులే. మన ధర్మం ఇహాన్ని ద్వేషించలేదు. పరాన్ని ఇహంతో సమన్వయించింది. వేదాలలో, ఉపనిషత్తులలో, రామాయణ భారతాది గ్రంథాలలో ఈ సమన్వయమే స్ఫురింపజేయబడింది.

ఈశోపనిషత్తు ఈ విషయాన్ని చక్కగా వివరించింది. ఒక్క భౌతికాన్ని-అంటే ఐహిక సాధనను ఉపాసించడం గ్రుడ్డితనం. అలాంటిదే కేవల పరమార్థ తాపత్రయం. రెండూ అవసరమైనవే.ఇలా కర్మ యోగిగా ఆత్మ వికాసం పొందుతూ, సుగుణాలను పెంపొందిస్తూ, పరిశ్రమచేస్తూ, అధ్యవసాయంతో ఈ శరీరాన్ని మరచి, ఆత్మకు, బుద్ధికి ప్రాముఖ్యాన్ని ఇచ్చే పాఠం మన ధర్మమొక్కటే నేర్పింది.

మహా భారతంలో విదుర నీతిలో ఈ విషయాన్ని వివరిస్తూ-రెండు రకాల మనుష్యుల్ని - దాతకాని ధనవంతుని, తపస్వికాని దరిద్రుని మెడలో బండకట్టి నూతిలో పడద్రోయాలని చెప్పబడింది. అంటే ధనాన్ని ధనమోహాన్ని, జయించనివాడూ వధ్యుడే. కష్టపడని దరిద్రుడూ వధ్యుడే. తపమంటే ముక్కూ చెవులు మూసుకొని గుహల్లో దూరడం కాదు. శీతోష్ణాలను, మానావమానాలను, యశాపయశాలను, అంటే ద్వంద్వాలను మరచి శ్రమ చేయడమే నిజమైన తపం. ఇది లేనిదే గుణాలు వికసించవు. సంపద లభింపదు. జ్ఞానం స్ఫురించదు. దరిద్రులు ఈ తపోమార్గాన్ని సంపాదించకపోతే పాపమే.

మన సమాజం మనను దరిద్రులు కమ్మనలేదు. ధనం అంటే కేవలం రూపాయలో, నాణెములో, కరెన్సీయో మరేదో కాదు. ధనం అంటే

అన్నీ ఉత్తమములైన కర్మలు వస్తాయి. బలం, శీలం, విజ్ఞానం, సంపదా- అన్నీ ధనాలే. ఇవి లేకపోవడం పాపం. వీనిని సంపాదించడానికి దరిద్రుడు ప్రయత్నించాలి. సంపాదించిన తర్వాత మోహాన్ని చంపుకోవాలి. అలా చంపుకోగలవాడే పురుషార్థి, ఇదీ మన నమ్మిక. మన మార్గం. అందుకే మన దేశంలో విరాగులైన సన్యాసులు ఎవరూ సోమరులుగా కూర్చోలేదు. సమాజం మీద భారంగా పడలేదు. శ్రమ - శ్రమ - ఇదీ మన ధర్మం నేర్పే పాఠం. అందరు కష్టపడాలి. ఆలా శ్రమిస్తూ నడిచే బాటలో మరణించడానికి సిద్ధపడాలి. ఈ సమన్వయ శిక్షణ మనకు మన ఈ కాషాయ ధ్వజం ప్రబోధిస్తుంది. శివాజీ దీన్ని ధరించాడంటే, ఆ యోగ్యతను సంపాదించాడు రాజ్యాన్ని స్థాపించిన తర్వాత రాజ్యాన్ని తన గురువుకు సమర్పించి, తాను ధర్మప్రతినిధిగా నిర్వహించాడు.

అలాంటి దివ్యమైన సందేశం ఇచ్చే గురువు ఈ ధ్వజం, మన సంస్కృతి యొక్క సమన్వయ తత్వాన్ని, సంపూర్ణ జీవన క్రమాన్ని ఈ ధ్వజం తెలుపుతుంది. దీన్ని ధరించి నడిచిన సన్యాసులే దేశంలో సమైక్యతను స్థాపించారు. ఇన్ని కష్టాలు వచ్చినా, అలలు అలలుగా విదేశీయులు, విధర్మీయులు మన మీద విరుచుకు పడుతున్నా, ఇంకా ఇంత సమరస భావంతో మన రాష్ట్రం ఎలా నిల్చోగలిగింది? కాలగతిలో చైతన్యం డీలాపడ్డా సంస్కృతీ సంరక్షణకై మన పూర్వులు కాషాయాన్ని ధరించి సన్యాసులై, యుద్ధ భూమిలో శత్రువుపైకురికి వీరయోధులై చూపిన త్యాగ ప్రతిభ ఊహాతీతమైనది. అందుకే ఇన్ని దురాక్రమణల విషమ సంధులను ఎదుర్కొంటూ కూడా నేటికీ ఇన్ని కోట్ల మంది ఈ ఆదర్శాన్ని పరిపాలించేవారు జీవించి వున్నారు. దీనికి కారణం గురువుగా నడిపించిన ఈ ధ్వజమే.

ఈ ధ్వజం ఇచ్చే స్ఫూర్తికి భేదభావంలేదు. త్యాగం అనేది సూర్య రశ్మి లాంటిది. అగ్నిలాంటిది. పూర్వులైన మహా పండితులు ఎందరో తమ పేరూ ఊరూ లేకుండా గ్రంథాలు రచించారు. పూర్వం ఒక పండితుడు ఒక గ్రంథం వ్రాయడానికి 50 ఏండ్లు తీసుకున్నాడట. ఆయనకు పెండ్లి అయింది. కాగానే ఈ గ్రంథరచనకు పూనుకొన్నాడు. ఆ రచనలో ఎంత నిమగ్నుడయాడంటే, నిత్య కార్యాలు నడిచేవికాని స్ఫురణ ఉండక పోయేది. అలా 50 ఏండ్లు గడిచాయి. గ్రంథం చివరికి వచ్చింది. ఒకనాడు రాత్రిపూట దీపం కొడిగట్టిందట. 50 ఏండ్లలో కొడిగట్టినదారోజే! ఎవరో ముదుసలి కొడిరాలుస్తూండటం పండితుడు చూచాడు. 'ఎవరూ'అని ప్రశ్నించాడు. "మీదాననే" అని ఆ సాధ్వి అన్నది. ఆయన ఆశ్చర్యపోయినాడు. స్మృతిచక్రం 50 ఏండ్ల పూర్వంలోని పరుగెత్తింది. తన భార్య కదూ! వివాహవేదిక దిగీదిగడంతోటే తానాగ్రంథరచనకు పూనుకున్నాడు కదూ! పాపం, ఈ ఇల్లాలు ఎంత ఘోష పడుతుందో? పండితుడు కృతజ్ఞతాభారంతో నతుడై అర్ద్రుడై తన యావజ్జీవితం ధారపోసిన గ్రంథానికి తన భార్య - 50 ఏండ్ల మహాతపస్సు చేసి, భర్త గ్రంథ రచనకు కళ్ళలో వత్తులు వేసుకొని సహకరించిన సాధ్వి - పేరు పెట్టాడు. తన భార్య భామతి. కాని తానెవరు? ఏమో? ఎంతటి ఏకాగ్రత? ఎంతటి త్యాగం తుదకు ఆనాడు పుస్తక లేఖనం వ్యాపారం కాదు. కాపీరైటు హక్కులు లేవు. మరి ఇలా శ్రమించిన దానికి ఫలితం? "త్యాగేనైకే అమృతత్వ మానశుః" త్యాగంలోనే అమృతత్వసిద్ధి ఉన్నదని మన ధ్వజం; మన కాషాయం నేర్పిన పాఠం అది.

పండితులే కాదు, శిల్పులో! ఒక్కసారి దేశాన్ని దర్శించిరండి, ఎంత మహోత్తమ శిల్పాలను మన పూర్వులు మలచారో! ప్రపంచాన్ని మరచి, తన రక్తాన్ని పోసిపెంచిన ఆ శిల్పవృక్షాలు ఈ నాటికీ ఫలాలనిస్తూ

దర్శకులకు సేదతీరుస్తున్నాయి. అదిగో మధుర దేవాలయం. పైపైకిలేస్తూ నిటారుగా మేఘాలను దూసుకొని, తలఎత్తి నిలిచిన ఆ మహాశిఖరంపై కలశం అమర్చిన ఆ దివ్యశిల్పి పేరెవరైన ఎరుగుదురా? ఎంతపెద్ద కట్టడం ఆ చిత్రశాల? ఒక్కదెబ్బ ఎక్కువైతే ప్రాణం ఉట్టిపడే ఆ మూర్తి భగ్నమై యుండేది కదా? ఎంత భక్తి? ఎంత శ్రద్ధ? ఎంత తన్మయత? ఎంత మోహ విస్మరణ? ఎవరాదాతలు? అంత ధనం ప్రవహించినవారు? ఎందరు శిల్పులు శ్రమించారో? ఒకనాటిదా ఆ తపస్సు? ఎవరీ మహా ప్రేరణ నిచ్చింది? "త్యాగాయ సంభృతార్థానామ్" సంపాదించిన అర్థం త్యాగం కొరకే అని నేర్పే ఈ కాషాయ ధ్వజలక్షణమే కదా? ఈ గురువే కదా!

ఈ ధ్వజచ్ఛాయలో అనాదిగా మన దేశం అసుర శక్తులను నిర్జించింది. ఈ అరుణ కేతువును ధరించి మన పూర్వులు అధర్మాన్ని, రాక్షస శక్తులనూ నిర్జించారు. ఇతిహాస, పురాణాలలో వర్ణింపబడ్డ మహావీరుల రథాలపై ఈ కాషాయధ్వజమే శోభిల్లింది. రాజపుత్రుల పరాక్రమానికి పరమోజ్వల చిహ్నంగా వెలుగొందింది ఈ ధ్వజమే. ఛత్రపతి శివాజీ ఈ ధ్వజఛ్ఛాయలోనే స్వరాజ్య స్వధర్మ! ప్రబోధంచేసి, హిందూ సామ్రాజ్యాన్ని నిర్మించాడు.

సూర్యుడు అజ్ఞాన తిమిరాలను తొలగించి జ్ఞానతేజస్సులను ప్రపంచానికి ప్రసాదించడానికి ఉదయించేటప్పుడు దిశలను కనికరించి ఆ మహత్తర తేజస్సుల ఆగమనాన్ని తెలిపేది ఈ కాషాయ వర్ణమే. పాపాన్ని మలినాన్ని దహించి పవిత్రమై, పైకి లేచే అగ్నిదేవుని పవిత్ర శిఖలను వరించినదీ కాషాయ వర్ణమే. "కేతుం అరుణం యజధ్వై" అని, "అరుణైః కేతుభిస్సహ" పురోగమించండని ప్రబోధిస్తూ "ఏతాదేవసేనాకి సూర్యకేతవః, సచేతకః, అమిత్రాకనో జయంతుస్వాహా", ఈ దేవసేనలు

ఉత్సాహంతో సూర్యవర్గ ధ్వజాలను పూని పురోగమిస్తున్నాయి. ఇవి తప్పక మన శత్రువులను జయించుగాక! అని ఉద్యమ గీతాలను పాడిన వేద మంత్రాలు ఈ కాషాయ ధ్వజకీర్తికే నీరాజనాలెత్తాయి.

రాష్ట్రానికీ, మన ధర్మసంస్కృతులకూ, మన సనాతనమైన జీవన గమనానికి సాక్షిగా, స్ఫూర్తిదాతగా నిలిచినదీ కాషాయ ధ్వజమే. ఈ ధ్వజం నుండి స్ఫూర్తిపొంది. దీన్ని ధరించి దేశధర్మ, సంస్కృతులను పరిరక్షించడానికి రక్తధారల భగీరథులు ప్రవహించాయి. అలాంటి దివ్య యశస్సుకు ప్రతీకం, నిర్దోషం, మాలిన్యరహితం, పరమ పునీతం, సన్యాసులగు వీతరాగులకూ, పరమ వీరులకూ ఆదర్శస్ఫూర్తికేంద్రంగా వెలుగొందిన లక్ష్యం ఈ భగవాధ్వజం. కనుకనే సంఘం గురువుగా కాషాయాన్ని స్వీకరించింది.

ఇలాంటి గురువును వరించిన తర్వాత ఆ గురువుకు మన తను మనోధనాలనర్పించి పూజించడం విధి. నిత్యమూ ఈ గురువైన భగవాధ్వజం ఏ జీవన తత్వానికి ప్రతీకమో, ఆ తత్వాన్ని అనుష్టించడానికి అధికాధికంగా సమయాన్ని అర్పించడమే తనువు నర్పించడం.మన తత్వం విజిగీషులుగా జీవించడం నేర్పింది. మన ఆదర్శం అది. దాన్ని గ్రహించి జీవించడంతోపాటు, మనం నేర్చిన ఆ జీవన తత్వాన్ని మననం చేసుకుంటూ ఇతరులచేత మననం చేయిస్తూ, మన జీవితాన్ని, మనస్సునూ అధికాధికంగా ఈ రాష్ట్రతత్వాన్ని ప్రచారం చేయడానికి సమర్పించుకోవడమే తను మన సమర్పణ. అలాగే గురుదక్షిణగా ప్రతి వర్షమూ మన సర్వశక్తినీ వినియోగించి ఆర్జించిన ధనాన్ని మన భగవాధ్వజం ముందు సమర్పిస్తాం. ధన సమర్పణ ఒక ప్రబలమైన పరీక్ష లేమిలో, బాధతో గురుదక్షిణకై భావుకుడైన స్వయం సేవకుడు

పరిమిత శక్తిని సమర్పిస్తూ అనుభవించే వేదన మన రాష్ట్ర పరం పరను గుర్తుకు తెచ్చి, మన ఈ రాష్ట్ర గురువైన భగవాధ్వజం పట్ల మన విశ్వాసాన్ని పెంచుతుంది. తన గురుపత్నికి కుండల ములు తెచ్చియిచ్చేందుకు పాతాళంలోకి తక్షకుణ్ణి వెంటబడి తరిమిన ఉదం కుడూ; గురువుగారి ఆదేశముతో రఘుమహారాజును యాచించి, ఆ రాజు ప్రతాపప్రతిభతో సంపాదించిన మహాధనాన్ని నిర్మోహంతో గురువు కర్పించిన కౌత్స్యుడు, పరోక్ష గురువైన ద్రోణునకు తన విద్యను సార్థక మొనరించే అంగుష్టాన్ని కోసి ఇచ్చిన ఏకలవ్యుడూ, ఈ మహాపరంపరలో ఆర్జించినా త్యజించగల త్యాగాన్ని ఈ కాషాయ ధ్వజం నేర్పే గుణ పాఠాన్ని గ్రహించినవారే! ఏ జాతీ, ఏ ధర్మమూ తాను నమ్మిన విశ్వా సాల పట్ల అంకితభావాన్ని పెంచుకోకుండా మనుగడ సాగించలేదు. హిందూజాతి పునర్జాగరణ కొరకు మహోద్యమంగా సాగుతున్న రాష్ట్రీయ స్వయం సేవక సంఘం జాతి ప్రజలలో త్యాగ శీలాలను, స్నేహం సోదరత్వాలను వ్యాపింప జేస్తుంది. అందుకే ఈ సాధనకు, ఈ సాధన ద్వారా సమాజశక్తి నిర్మాణానికి భగవాధ్వజాన్ని గురువుగా స్వీకరించి పురోగమిస్తున్నది. అందుకే అషాఢ పూర్ణిమనాడు దేశమంతటా భగవా ధ్వజచ్ఛాయలో సంఘటిత హిందూ సమాజాన్ని సమీకరించి "ఇదం మమ, రాష్ట్రాయస్వాహా" అనే వైదిక యజ్ఞాగ్నిని దేశంలో రగుల్కొ లుపుతున్నది.

# రక్షాబంధనం

ప్రతి పండుగకూ ఒక విశేషమైన ధార్మిక సంబంధమో, లేక మరో సంబంధమో, ప్రాచీనమైనది ఉండి తీరుతుంది. అనాదిత్వమేగాక, దానిని చిరకాలం సమాజం అనుసరిస్తూ వచ్చినందువల్ల సమాజానికి ఆ పండుగలకీ విడదీయరాని సంబంధం ఏర్పడుతుంది. ఆపద వచ్చినప్పుడు తాబేలు తన డిప్పలోకి కాళ్ళు ముడుచుకొని, ఆపద తొలగగానే కాళ్ళను తిరిగి బైటకుతెచ్చుకొని స్వేచ్ఛగా తిరుగుతుంది, అలాగే ఆపదలలో మన సంప్రదాయాల విశేషాలను ప్రకటించే పండుగల స్వరూపం కుంచించుకొనిపోయింది. ఇక, ఆ పండుగల స్వరూపాన్ని స్వతంత్ర సమాజంలో యథారూపంలో ప్రకటించుకొని, గ్రహించి, అనుసరించాలి. దాని నుండి ప్రేరణ పొంది, సమాజానికి దాని అవసరాన్ని విప్పి చెప్పాలి.

పండుగలు అనేకం ఉంటాయి. కాని కొన్నింటికే శాశ్వతత్వం లభిస్తుంది. ఏదో కొన్నాళ్ళు దాన్ని ఆచరించి విడిచిపెట్టడం కాకుండా, కష్టంవచ్చినా, సుఖంవచ్చినా దాని ననుసిరించే పరిపాటి. అది ఉపయోగపడే తీరూ సమాజపరంగా ఉపయోగకరంగానైనా ఉండాలి. లేదా దేశ కాలాతీతంగా ఆధ్యాత్మిక మనోధర్మాన్ని పోషిస్తూ ఉండేదిగానైనా కావాలి. కాలగతిలో అలా దాని ఉపయోగం స్థిరపడిపోవాలి. దాన్నుంచి ఆ ప్రేరణ పొందగలగాలి.

రక్షాబంధనం అలాంటి పండుగల్లో ఒకటి. రక్షాబంధనం శ్రావణ పూర్ణిమ రోజున వస్తుంది. ప్రాచీన కాలము నుండి ఈ శ్రావణ పూర్ణిమ విద్యాధ్యయనమునకు ప్రారంభ దినంగా పాటించబడుతుండేది. శ్రావణం

నుండి వర్షఋతువు ఆరంభమవుతుంది. వ్యాపార వ్యవహారాల అలజడి తగ్గి అధిక సంఖ్యాకులు తమ తమ ఇండ్లలో స్వీయవృత్తులలో స్థిరంగా ఉంటారు. అలాంటి స్థిర సమయంలో శాంతంగా అధ్యయనాధ్యాపన క్రియలు సులభసాధ్యము లవుతాయి. కనుక ఈనాడు శాస్త్రోక్తంగా తమ విద్యా విజ్ఞానాల అభివృద్ధికి కంకణం కట్టుకొని ప్రయత్నం ప్రారంభం చేసేరోజు. చాతుర్మాస్య దీక్షాదినాలుగా కూడా యతులకు, సన్యాసులకు స్థిరంగా ఒక చోట ఉండి తమ అనుష్ఠానాలను చేసుకుంటూ, ధర్మానుష్ఠాన తత్వ ప్రబోధాలను కొనసాగించే కాలం.

ప్రతి సమాజానికి శరీరశక్తితోపాటు మేధాశక్తి కూడా అవసరం. సమాజపు బుద్ధిని విద్యా విజ్ఞానాలతో అభివృద్ధిపరచి, సమాజ పురోభివృద్ధికి అవసరమైన మేధాశక్తిని వికసింపజేయడం కూడా ఒక మహావ్రతమే. మన సమాజం వ్యక్తి, సమష్టుల మేలు కలయికకై వికసింపజేసిన వ్యవస్థ లలో శరీర మేధాశక్తుల వికాసంకొరకు కూడా కొన్ని ఏర్పాట్లుచేసి దానికి కూడా ధార్మికమైన ప్రతిపత్తి ఇచ్చింది. "అగ్రతః చతురోవేదాన్, పృష్ఠతః సశరం ధనుః" నాల్గు వేదములు ముందు నడిచినపుడు దానిని రక్షించ డానికి వెనుక ఆయుధ పాణులై, ఆవేదముల రక్షణకు నిలువగల సమాజం ఉండాలి. అది లేనినాడు ఆ సమాజం ఎంత మేధాశక్తిని కలిగి వున్నా లాభంలేదు.

పూర్వం ఒకప్పుడు దేవదానవులకు పన్నెండేండ్లు యుద్ధం జరి గింది. ఆ యుద్ధంలో ఇంద్రుడు ఓడిపోయినాడు. రాక్షసుల బాధల వత్తిడిని భరించలేక అనుచరులతోపాటు అమరావతిలో తలదాచుకున్నాడు. రాక్షస రాజు ముల్లోకములు జయించి, తనకు ఊడిగాలు చేయాలని ప్రకటించాడు. దేవకర్మలు, దేవధర్మములు పరిహసింపబడుతూండేవి. రాక్షసులు

క్రమంగా అమరావతిని కూడ ఆక్రమించుకోడానికి వచ్చారు. అపుడు ఇంద్రుడు బృహస్పతిని సమీపించి "ఆచార్యా, మీరు బుద్ధిమంతులు, రాక్షసులు అమరావతిని చుట్టుముట్టారు. ఇంక లాభంలేదు. యుద్ధం చేసి మరణించడం శ్రేష్ఠం. దీవించండి" అని నమస్కరించాడు. బృహస్పతికి దారి తోచలేదు. యుద్ధం వద్దని మందలించాడు. అది అదను కాదన్నాడు. దేశ కాల పాత్రాల ననుసరించి పురుషుడు కర్మాభిరతుడగుట మంచిదని సలహా ఇచ్చాడు. ఇద్రునికది నచ్చలేదు.

ఇంతలో శచీదేవి వచ్చి "ప్రభూ! పౌరుషం ప్రకటించడానికి ఇంతకంటే మరొక సమయంరాదు. మీ ధర్మమూ, మర్యాదలు, మీ కర్మలూ అపహాసింపబడినా, అవమానింపబడినా, ఇది అదను కాదని ఊరుకోడం మంచిదికాదు. ఇంతగా అవమానాగ్నికి దహించుకుపోతున్నా, గుండెలో సెగలు రాజకపోవడం పౌరుషానికి చిహ్నం కాదు. దేవ హితములైన సర్వ ధర్మముల సంరక్షణ కొరకు నేడు సర్వులూ సిద్ధమై మీకు జయాన్ని కోరుతున్నారు. మీకు రక్ష కట్టి నిల్చుంటున్నా" రని ఇంద్రునికి రక్ష కట్టి, ఇంద్ర విజయానికి పరమేశ్వరుని పూజించింది. దేవతలు ఆబాలగోపాలమూ ఇంద్ర విజయ యాత్రను సమర్థించారు; అండగా నిలిచారు.

ఇంద్రుడు రాక్షస సైన్యాన్ని ఎదిరించి, రాక్షసులను జయించాడు. అలా తిరిగి త్రిలోకాధిపత్యాన్ని చేబట్టి, దేవ ధర్మ దుందుభులను మ్రోగించాడు.

నాటి నుండి ఈ పర్వదినంనాడు "యేనబద్ధోబలీరాజా దానవేంద్రో మహాబలః, తేనత్వామభి బధ్నామి. రక్షేమాచల మాచల" అని పఠిస్తూ రక్షను కట్టుకునే ఆచార మేర్పడింది.

ఆపదలోవున్న ఇంద్రునికి అలనాడు శచీదేవి రూపంలో సర్వ దేవతలు రక్ష కట్టి ఇంద్ర విజయానికి తోడ్పడినారు. ఇది విచిత్రమైన కథ.

దేవ ధర్మం సర్వ శ్రేష్ఠమైనదే, దేవ గురువు బృహస్పతి సర్వ శ్రేష్ఠుడైన బుద్ధిమంతుడే. కాని, రాక్షస శక్తి విజృంభించినప్పుడు, దానిని ఎదిరించగల భౌతిక శక్తిని, సమీకరించలేని సమయంలో ఇంద్రుని భార్య స్వయంగా రక్షకట్టి, యుద్ధానికి ప్రేరేపిస్తుంది. యుద్ధంలో హాని సంభవించవచ్చు. తన మాంగల్యానికి మొప్పం రావచ్చు. కాని ధర్మ, కర్మలకు హాని సంభవించి, దేవలోకంపై రాక్షసరాజ్యం ఏర్పడే విషమ సంధి ఏర్పడ్డప్పుడు, స్వసుఖం విడిచి తన ధర్మాన్ని శచీదేవి నిర్భయంగా అనుసరించింది. తన మాంగల్యంమీద ఆ తల్లికి అంత విశ్వాసం. ఈ చర్యతో దేవతలలో ఎంతటి పౌరుషం విజృంభించి ఉండవచ్చు? ఎంత తెగింపు వచ్చివుండవచ్చు? ఎంత కట్టుబాటు జాగృతమై యుండవచ్చు? మేధ ఒక్కటేగాక, సమైక్య ప్రయత్నానికి పురిగొల్పిన ఆ "రక్ష" సమాజ రక్షణకు ముక్కోటి శక్తులను ఏకంచేసి నడిపించిన "భాగ్య రక్ష"గా రూపొందింది. దేవతలు విజయం సాధించారు.

మానవుడు దేవాంశ కలవాడు. ఈ కనబడే ప్రపంచంలో జీవ యాత్రకు ఏమిచేసినా అతనిలో స్వభావ సిద్ధమైన సద్గుణాలు కోకొల్లలుగా ఉన్నాయి. ఎంతటి స్వార్థియైనా జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ఆశ్చర్య విభ్రమాలు కల్గింపజేసే తెగింపుకు పూనుకుంటాడు. ఇది సహజం. సర్వ సామాన్యం. మానవుడు సంస్కారశీలి కూడా. సంస్కారాలు ఎలా నిరంతరాయంగా అతనికి లభిస్తే, ఆ సంస్కారాలుద్దేశించిన దిశలో అతని ప్రయాణం నడుస్తుంది? సమాజంలో ఉన్న వ్యక్తులలో ఏది విడరాని బంధాన్ని సృష్టిస్తుంది? భౌతికమైన కోరికయా? ఆ కోరికపైన ఆధారపడిన ప్రవర్తనయా? అది వ్యాపారమే కాగలదు. భౌతిక వాంఛలమీద ఆధారపడిన స్నేహసంబంధాలు లాభనష్టాల ఫలితాలనుబట్టి ఉంటాయి. అదే ఆధారంగా నిలుపుతే సంఘర్షణ తప్పదు. వ్యక్తి వ్యక్తికి మధ్య అను

మానం, శంకా తప్పవు. సంస్కారముతో ఇవే ఇమిడ్చి ఇస్తే జీవనధ్యేయం కూడా శంకాసంకులం కాక తప్పదు. కనుక సమాజ ధారణకు కావలసిన గుణములలో నిర్మోహమైన ప్రేమ చాలా ముఖ్యమైనది. వైభవదశలో స్ఫురించని రక్ష, అపాయం తటస్థించినప్పుడు స్ఫురించి, దేవతల నొకే త్రాట కట్టగలిగింది. "నీవు సమాజానికి రక్ష, నీకు సమాజం రక్ష" అనే భావనతో "ఏ రక్షతో మహా బలవంతుడైన రాక్షస రాజును బంధించ గలిగామో ఆ రక్షతో నన్ను బంధిస్తున్నారు." అనే నేటికీ మనం ఈ పండుగను చేసుకుంటున్నాం

నిత్య జీవితంలో ఎవరికివారం మన మన వ్యవహారాలలో, సంసారాలలో చిక్కుకుని నడుస్తున్నప్పుడూ, ఆశయ విస్మరణ జరుగకుండా ఏ విద్యా విజ్ఞానాల మీద మన ధర్మ సంస్కృతీ సంప్రదాయాలు ఆధార పడ్డాయో వాటిని స్మరింపజేసేవి శ్రావణపూర్ణిమ. ఆ ధర్మ సంస్కృతీ సంప్రదాయాలకు నష్టం వాటిల్లినప్పుడు, పరస్పరమైన రక్షకులమై నిల్చునే గుణపాఠం నేర్పేది రక్షాబంధన్.

"ధర్మోరక్షతి రక్షితః", ధర్మ స్వభావమది. ధర్మం ఎవరిని రక్షిస్తుంది? ధర్మాన్ని రక్షించినవాళ్ళనే ధర్మం రక్షిస్తుంది। ధార్మికులై ధర్మ సంస్థాపనకు స్థిర సంకల్పులై ఉన్న ప్రజలు ఒకటై ధర్మరక్షణకు నిల్చున్ననాడు, ఆ ధర్మం అట్టివారిలో ప్రాణం నింపి, జీవంపోసి,వారిని అజేయులుగా చేస్తుంది. అట్టి ధర్మరక్షణలో పరస్పర రక్షణ, సమాజ రక్షణా ఉన్నాయి.

రక్షాబంధనంలో ఆ స్వభావం ఇమిడి ఉన్నది. ఆ స్ఫూర్తినిచ్చే శక్తి ఉన్నది. ఏనాడో శచీపురందరుల గాథేకాదు. చారిత్ర్యకంగాకూడా మనకీ రక్షాబంధనంతో ఇమిడి వున్న కథలు అనేకంగా కన్పిస్తున్నాయి.

ఔరంగజేబు పరిపాలనలో హిందువులపై అతడొనర్చిన అక్రమాలకు అంతులేదు. తన సామంతుడైన ఒక రాజపుత్రునిపై అతనికి కినుక వచ్చింది. మోసంతో అతన్ని వధింపజేసి, అతని కుటుంబాన్ని మట్టు పెట్టడానికి యోచించాడు. ఆ రసపుత్రునిభార్య, ఔరంగజేబు సామం తులలో మరొకనికి- అతడూ రసపుత్రుడే- రక్ష పంపిందట. ఆ రక్షను పంపిన ఆ సోదరిని రక్షించడానికి ఆ రసపుత్రవీరుడు కంకణం ధరించి ఔరంగజేబు ప్రయత్నాలను విఫలమొనరించాడు. అమరసింహ - దుర్గా దాసుల కథ జగద్విఖ్యాతం కదా!

ఛత్రసాలుడు బుందేల్‌ఖండ్‌కు రాజు. మొగలాయిలతో పోరి పోరి అలసిపోయినాడు. చివరికి విసిగి, విసిగి హిందూ సామ్రాజ్యాన్ని వ్యాపింపజేయ స్థిరవ్రతుడై నిల్చిన శ్రీ బాజీరావు పీష్వాకు సందేశం పంపి సహాయం కోరుతాడు. బాజీరావు ఛత్రసాలునికి రక్షపంపి అతనికి సహాయం చేస్తాడు.

హిందూ ధర్మరాజ్య ప్రతిష్ఠాత శివాజీ, భవానీదేవి కృపాలబ్ధమైన ఖడ్గాన్ని స్వధర్మ, స్వరాజ్య రక్షణలకు ఉపయోగిస్తానని ప్రతినబూని రక్షాకంకణం ధరిస్తాడు.

రక్షాబంధనం నేటికీ సమస్త భారతంలో ఏదో ఒక రూపంలో ఆచరింపబడుతూన్న పండుగ. మన సమాజంలో ఏ కార్యక్రమానికి పూను కున్నా సంకల్పం చెప్పుకోక తప్పదు. ఆ సంకల్పం "నేను ఈ పనిని చేస్తున్నాను" అని దానికి ముందు సంకల్ప చిహ్నంగా ''రక్ష''ను కట్టు కోడం ఒక ధార్మిక క్రియ చిహ్నం. అంటే, ఆ తలపెట్టిన కార్యాన్ని నిర్విఘ్నంగా పూర్తి చేస్తాను అని ఆరక్షను ధరిస్తామన్నమాట. సాధారణ సంప్రదాయము, పరిపాటిప్రకారం ఈ రోజున అన్నకు తోబుట్టువు రక్ష కడుతుంది. తోబుట్టువుల మధ్య ప్రేమానురాగాలకు అవధులుండవు. సమాజంలోని వ్యక్తులందరూ తోబుట్టువులే. ఆ సమాజంలోని తోబుట్టువు తనాన్ని గ్రహిస్తే రక్షాబంధన తత్వం బోధపడుతుంది.

"ఈ సమాజం నాది. ఇది నా విశాల కుటుంబం. ఈ కుటుంబ సుఖ దుఃఖాలు నావి. మంచి చెడులు నావి" అనే భావనతో సహజన్మ భావం స్ఫురిస్తుంది. సమాజం అంటేనే అది. వ్యక్తులమధ్య పరస్పర రక్షణ భావం అంటే శరీర రక్షణ వరకే కాదు. ఏదో ఒక సమభావన, సమాన స్పందన, సమాన అనుభూతి లేనిదే సమాజం ఏర్పడదు సమానంగా, సమత్వంగల కొన్ని లక్షణాలతో జన్మించే వ్యక్తుల సమూహమే సమాజం. అలాంటి వారికే సమాన భావన, స్పందన, అనుభూతి ఉంటాయి. అప్పుడే పరస్పరం స్నేహభావన అంకురిస్తుంది.

హిందువులకు సమాజ భావమంటే ఏది? దేనివలన వారిలో సమాన స్పందన కల్గుతుంది? ఏ అనుభూతి వారిలోని ఏకత్వాన్ని స్ఫురింపచేసి వారిని కర్తవ్యోన్ముఖులనుగా చేస్తుంది? ఏది లోపించినందువల్ల నేడు హిందూ సమాజం నిద్రాణమై ఉన్నది?

హిందూ సమాజం ఈ దేశంలో అనాద్యనంత స్థితిగల సమాజం. ఏనాడు పరమేశ్వరానుగ్రహం వల్ల జీవన వికాసం ఇక్కడ గల్గిందో నాటి నుండి నేటివరకు ఇహపర సాధకమైన ఒక తత్వాన్ని మార్గంగా పెట్టుకొని ఇక్కడ ఈ సమాజం అనంత యాత్రను సాగిస్తున్నది. ఈ యాత్రలో ఈ సమాజ జీవనపోషణకు, సంరక్షణకు, వికాసానికి, మామూలు వ్యక్తుల నుండి మహర్షులు, చక్రవర్తుల వరకు తమ సర్వశక్తులను ధారపోసి ఒక పరిపాటిని ఏర్పరిచారు. ఒక జీవన లక్ష్యాన్ని, జీవితంపట్ల ఒక దృక్పథాన్ని వికసింపజేశారు. అది హిందూ సమాజంలో ప్రతి జీవన చర్యలో ప్రత్యక్షమవుతుంది. కాలపు వత్తిళ్ళవల్లా, తాకిడులవల్లా కొంత స్వరూప భ్రంశం పొందినా సమాజ లక్ష్యం భావం ఒకటిగా ఆసేతుసీతనగం

కన్పిస్తుంది. అంతస్సూత్రంగా ప్రవహించే ఆ ఏకత్వాన్ని పరామర్శిస్తే, హైందవధర్మం సంస్కృతీ, సదాచార పరంపరల సంపూర్ణ చరిత్ర ఈ దేశంతో హైందవ జాతికున్న "మాతా పుత్ర" సంబంధపు అనాద్య నంత స్పష్టంగా దర్శనమిస్తాయి.

ఈ మహత్తర పరంపరను సృష్టించిన, ఈ భావనను స్ఫురింప చేయడానికి పూర్వీలు జరిపిన కృషి, పడినపాట్లు, సాధించిన విజయాలు, పొందిన పరాజయాలు, వాని విమర్శ మనను స్పందింపజేస్తాయి.

వేనుడు క్రూరుడై సమాజాన్ని హింసిస్తున్నపుడు, పృథుమహారాజు ప్రజలకు ధర్మ రాజ్యాన్ని ప్రసాదించడానికి పడిన పాట్లు మనను కదిలిస్తాయి.

రాజ ధర్మం విస్మరింపబడిననాడు, ధర్మరక్షకుడైన రాజు ఎంతటి అసిధారావ్రతుడై ఉండవలెనో చూపడానికి శ్రీరామచంద్రుడు పడిన పాట్లు, సీతమ్మ దుఃఖాలు మన గుండెలను కదిలిస్తాయి. కండ్ల నీరు కురిపిస్తాయి.

ధర్మ మార్గావలంబనం కొరకు పాండవులు పడిన పాట్లు, భంగ పాట్లు మన హృదయాలను కలపెడతాయి. మనసులకు పదును పెడతాయి మహా చక్రవర్తులను, సమ్రాట్టులను తన పాదాల నభిషేకింప చేసుకోగల మహాత్ముడు శ్రీకృష్ణభగవానుడు. "ఇదం న మమ" అని విరాగియై. కర్మ జీవనంతో సాధు సంరక్షకుడై, దుష్కృతుల హంతయై ధర్మ సంస్థాపన చేసిన తీరు మనలో ఉత్తేజాన్ని, భక్తి భావుకతలనూ వెల యిస్తాయి.

చంద్రగుప్త చాణక్యులు, మహా రాణాప్రతాప్ బామా షాహ్‌లు, శివాజీ రామదాసులు, ప్రతాపరుద్ర విద్యానాథులు, హరిహర విద్యారణ్యులు ఈ పరంపరాగత ధర్మాన్ని, జీవనాన్ని పోషించి, రక్షించి వికసింప జేయడానికి పడిన పాట్లు మనలో ఒక ఆత్మీయతను సృష్టిస్తాయి.

ఈ మహా పరంపరలో ఒక ఆత్మీయభావం స్పందిస్తుంది. ఈ దేశం నాది, ఈ ధర్మం నాది, ఈ చరిత్ర నాది, ఈ మహాజనం నా సోదరులు అనే దివ్యానుభూతి, ఒక అమృత భావన స్పందిస్తుంది.దీని రక్షణ, పోషణ భారం,

రక్షణ కర్తవ్యం, వికాస కార్యం నాపైన ఉన్నాయి అనే భావన స్ఫురించి, మనసు కర్తవ్యోన్ముఖులనుగా చేస్తుంది. ఆ భావన స్పందించిననాడు, ఈ మహాయాత్రలో, ఈ మహాదీక్షలో కలిసి ప్రయాణం చేస్తున్నవాళ్ళు నా వాళ్ళు అనే భావన సహజంగా జన్మిస్తుంది. ఈ భావం లేకపోబట్టే కదా మనం వేరై, విడిపోయి, ఒకరినొకరు విరోధించి, ద్వేషించి, ఒకరినొకరు వంచించుకొని ఈ మహాపరంపరను, ఈ జీవనామృతాన్ని, పోగొట్టుకున్నామనే భావన స్ఫురిస్తుంది.

"మనం ఒకటే. ఒకే అనుభూతులుగల సమూహం మనది. మన ఇహపరాల అనుబంధం ఒకటి. మన హృదయ స్పందన ఒకటి. మన యీ ఐక్యతలో మన వికాసం ఉన్నది. దీని రక్షణలో మనలో అమృతం నించి, మన సమాజానికి సంజీవిగా పనిచేయగల శక్తి ఉన్నది." అదే భావనతో "నీవు నాకు రక్ష, నీకు నేను రక్ష, మనమీ సమాజానికి, ధర్మానికీ రక్ష, ఈ సమాజము, ధర్మము మనకు రక్ష" అనే ఉత్ఫుల్ల భావంతో ఈ రాఖీ పూర్ణిమనాడు మననం చేసుకోగల్గుతాం.

రాష్ట్రీయ స్వయంసేవక సంఘం ఈ పండుగను తిరిగి సమాజంలో భాతృభావనను, ఐక్యతను, ఏకీకృత శక్తిని పెంచడానికి ఆచరింపచేస్తున్నది. వ్యక్తులలో అనేక గుణాలు ఉండవచ్చు. ప్రపంచ దిగ్భ్రాంతి కల్గింపజేసే చాతుర్యం, విద్వత్తు, తదితర కౌశలాలూ ఉండవచ్చు. కాని అవి సమాజానికి అభిముఖంగా, ఉపయోగకరంగా నడవకపోతే లాభం లేదు. "మణిః వజ్ర సముత్కీర్ణా, సూత్రస్యాస్తిమేగతిః", అని మహాకవి కాళిదాసు అన్నారు. మణులు విడివిడిగా ఎన్ని పడిఉన్నా లాభం లేదు. వానిని ఒకచోట చేర్చాలి తాననుకున్న ఊహతో, తానూహించిన రూపంలో మలచాలి అలా మలచిన ఆ విడివిడి మణులను ఒక సూత్రంలోకి బంధించాలి. మాల అందంగా ఉండాలంటే దానిలో ఒక క్రమం, ఒక ఊహ ఉండాలి. ఏక సూత్రతలేక, ఊహలేక ప్రోగుపోస్తే దానికి విలువ లేదు. రాష్ట్రీయ స్వయంసేవక సంఘం ఈ మణులకు మెరుగుపెట్టి, తొలచి మలచి, పరస్పరం ఒకే మాలగా రూపొందచేసేందుకు సంఘటన రూపంలో ఎత్తిగుచ్చుతూన్నది

# విజయ దశమి

ఆశ్వయుజ శుద్ధదశమిని విజయదశమి అనీ దసరా అనీ వ్యవహరిస్తాం. మన శాస్త్రములలో, పురాణాలలో, కావ్యాలలోనూ, మనదేశంలోని ప్రజల పరంపరాగత జీవితంలోనూ విజయదశమికి ఉన్న మర్యాద, గౌరవ మన్ననలు, ప్రాముఖ్యమూ మరో పండుగకు లేవనడం అతిశయోక్తికాదు ఆసేతు శీతాచలం, సర్వభారతంలో, ప్రతి ప్రాంతంలో ఈ పండుగను, ఈ మహా పర్వాన్ని ఘనంగా జరుపుకునే పరిపాటి నేటికీ ఉన్నది.

దశమికి ముందు నవరాత్రులు జరుగుతాయి. అంటే ఆశ్వయుజ శుద్ధపాడ్యమి నుండి నవమి వరకు సకలలోక జననియైన ఆదిశక్తియొక్క అవతారాలను రోజు కొక్కొక్కటి చొప్పున పూజిస్తారు. పదవనాడు విజయదశమి. ఈ ఆదిశక్తి అపరాజితా దేవియట. అంటే పరాజయం ఎరుగనిది. అప్రతిహతయట. అనగా ఎదురులేనిది. ''జయంతి'' యట. అనగా విజయశీలమైనది. వైజయంతీ దేవియట. అనగా విజయముల నిచ్చునది.

ఈ పండుగ సందర్భంగా శస్త్రాస్త్ర పూజలు జరుగుతాయి. సాయంత్రం కాగానే సీమోల్లంఘనం చేస్తారు. అంటే పొలిమేరలు దాటడం అన్నమాట. ఈనాడే శమీవృక్షాన్ని (జమ్మి) పూజిస్తారు. జమ్మిని అగ్నిగర్భ అనిగూడా అంటారు. ఆనాడు ''శమీ శమయతేపాపం, శమీ శత్రు వినాశనీ'' అని స్మరిస్తారు. పొలి మేరలుదాటి గరుడ దర్శనం చేసుకొని తిరిగి వస్తారు. గరుడుడు మహాసత్వశాలి. అయినా తన తల్లిని దాస్య

బంధనాల విముక్తిరాలినిగా చేయడానికి, మహా ప్రయత్నం చేయాల్సి వచ్చింది. సీమోల్లంఘనంచేసి అమృతాన్ని సాధించాల్సి వచ్చింది, అందుకే గరుడ దర్శనం జయిష్ణువైన మహావీరుని దర్శనంగా విజయ స్ఫూర్తి కరంగా భావిస్తాము. అది సీమోల్లంఘనం.

విజయదశమి సందర్భంగా రామలీలలు ప్రదర్శించడం కూడా ఉన్నది. రావణాసురుని బొమ్మను ఆ రోజు తగులబెడతారు. రాజపుత్ర స్థానంలో విజయదశమీ ఉత్సవాన్ని మహోత్సాహంగా జరపుకుంటారు. ఆయుధ క్రీడలు వగైరాలు జరుగుతాయి. పూర్వం నుంచీ ఈ విజయ దశమినాడు శస్త్రకౌశలాల పరీక్షా, అరితేరిన జోదులను గౌరవించడం పరి పాటిగా ఉండేది.

విజయదశమి ఈవిధంగా మన దేశంలో శక్తి పూజకు చిహ్నంగా మన జాతీయ జీవన పరంపరకు ప్రాణంగా నిలిచింది. విజయదశమి అనగానే శస్త్రపూజ, సీమోల్లంఘన, అపరాజితా దేవిపూజ, విజయోల్లాసం గుర్తుకు వస్తాయి. నిస్త్రాణంగా పడి ఉన్న ప్రాణంలో నవశక్తి ఉప్పొంగు తుంది. నిద్రాణమైన జాతికి, ఆశావహమైన, అజేయమైన జీవన సంకల్పం, పట్టుదలా స్ఫురిస్తాయి. విజయ దశమితో సంబంధం గల ప్రతి గాధలోనూ ఇలా ఇహపర శక్తుల సమన్వయం కన్పిస్తుంది. జగత్తులోని అసురశక్తికీ, దైవశక్తికీ సంభవించే పోరాటము, ఆ పోరాటంలో దైవశక్తికి విజయమూ ఈ ఉత్సవంలో స్ఫురిస్తాయి.

పరంపగాగతమైన మానవ మర్యాదను ఉల్లంఘించి, ఏ బలమూ తన నిర్ణయాన్ని ప్రపంచంమీద రుద్దలేదు. జాతుల నడిపించేది, ఆయా జాతుల స్వభావం. స్వభావం అనేది ఒక్కరోజులో వచ్చేదికాదు. అనుక రిస్తే ఏర్పడదు, ఈసడించుకొని వదిలించుకుందామన్నా పోదు. అది ఆయా జాతుల నెత్తురులో, మాంసమజ్జలలో, ఎముకలలో కలిసి ఉంటుంది. ఎంత

వరకు ఆ స్వభావానికి దెబ్బతగలదో అంతవరకు ఆ జాతి ఎన్నికష్టాలనైనా అవమానాలనైనా భరిస్తూ తన మనుగడ కాపాడుకుంటుంది. ఆ స్వభావాన్ని అవమానిస్తే ఆ జాతిమొత్తం ఒక్కటై అంతర్నిహితంగా ఉన్న సర్వశక్తులనూ క్రోడీకరించుకొని ఆక్రోశిస్తూ లేస్తుంది. దెబ్బతిన్నపాములా లేస్తుంది. మహాశక్తిగా ఆవిర్భవిస్తుంది. కాని, స్వభావమే నశిస్తే జాతి నశిస్తుంది. ప్రపంచంలో తన స్వభావాన్ని కాపాడుకోవడానికి తన మనుగడను నిల్పుకోడానికి విజయవంతమైన సాధన సల్పిన జాతులే తక్కువ. అది ఆయా జాతుల లోపం కావచ్చు. లేదా స్వభావ నిర్మాణంలో జరిగిన లోపమే కావచ్చు. పూర్వ సభ్యతలు గల జాతులుగా పేరు పొందినవేవీ. నేడు ప్రపంచంలో తమ పూర్వ సభ్యతలను, సంస్కృతులను నిల్పుకో లేకపోయినవి. ఆయా సమయ సందర్భాలలో, ఆయాకాలాల అవసరాల పూర్తికి అవసరమైన భావ వలయాలను నిర్మించుకొని ఎప్పటి కప్పుడు రూపం మార్చుకుంటూ, నేడు పూర్తి భిన్నమూర్తులుగా కన్పిస్తున్న ప్రజా సమూహాలున్నవి. కాని పరంపరాగతంగా సృష్టి సర్వాన్ని మానవుని స్వరూపాన్ని సాక్షాత్కరించుకోడానికి ఎడతెగకుండా, నిర్విరామంగా కృషి, తపస్సులా చేస్తున్నది ఒక్క భారతజాతి మాత్రమే. విజయదశమి ఆనిర్విరామ కృషికీ, ఆ తపస్సుకూ సాక్షి; ఆ కృషినీ, తపస్సునూ, నిత్యానూతనంగా నడిపించే మహాపర్వం.

కల్పాంత కాలంనుంచీ నేటివరకు ఏటా శరత్కాలం తెచ్చే చాంద్రీమయ మాధుర్యామృతంతోపాటు విజయదశమికూడా ఒకే దివ్య సందేశాన్ని అందుకొమ్మని మనను ఆహ్వానిస్తుంది. మనను ఉత్సాహంతో నింపి ముందుకు నడిపిస్తుంది. మన సంస్కృతీ చరిత్రకు విజయదశమి సజీవసాక్షి. మన జాతీయ వికాసాన్ని అచ్చంగా చూపే దర్పణం. మనలోని స్వార్థాన్ని, దుర్బలత్వాన్ని, తామసాన్ని తొలగించి నడిపించే శక్తి.

విజయదశమి చరిత్ర హిందూజాతి చరిత్ర. విజయదశమి ఇచ్చే సందేశం మన జాతిని సనాతనంగా చిరంజీవిగా నిల్పే అమృత సందేశం.

ఉపనిషత్తుల్లో ఒక కథ ఉన్నది. రాక్షసులకూ - దేవతలకూ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో దేవతలు జయించారు. కానీ దేవతలకు ఆ విజయం ఎక్కడలేని అహంకారము తెచ్చిపెట్టింది. దేవతలందరూ దర్బారు తీర్చారు. ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, వాయువూ మొదలగు తేజోమూర్తులు ఆసీనులై తమతమ పౌరుషగాథలను వర్ణిస్తున్నారు. తమ తమ పరాక్రమంవల్లనే అసురులు ఓడిపోయారని చెప్పుకుంటున్నారు. తామే దేవ విజయానికి కారకులమని ప్రగల్భాలు పలుకుతున్నారు. ప్రతి ఒక్కడూ తనవల్లనే విజయం సాధ్యమైందని అంటున్నాడు. ఇంతలో ఆకాశంలో ఒక మూల తటిల్లతలా మెరుపు మెరిసింది. విభ్రాంతి కల్గించే ఆ మెరుపును దేవతలెన్నడూ చూచిఎరగరు. ఆ శక్తిపుంజం కళ్ళకు మిరుమిట్లు కొల్పింది. సమస్త భౌతిక శక్తులకూ అధిష్టాన మూర్తులైన దిక్పాలకులు ఆ తేజఃపుంజాన్ని చూచి ఆశ్చర్యంతో ప్రతిభలు కోల్పోయి ఆలోచనలో పడ్డారు.

"ఎక్కడిదా మెరుపు? ఆ మెరుపులో వెల్గిన ఆ తేజోమూర్తి ఎవరు?" అని అడిగాడు ఇంద్రుడు. బృహస్పతి బుద్ధి పనిచేయలేదు. దేవతల ఆలోచనలు స్తంభించాయి.

"అగ్నీ! వెళ్ళి ఆ తేజమేమిటో తెలుసుకొని దయచేయండి" అన్నాడు ఇంద్రుడు. అగ్ని వెళ్ళాడు.

కాని ఆ దివ్యమూర్తిని సమీపించగానే అగ్నిదేవుని నోరు పెకల లేదు. చేష్టలు లేక అలా నిల్చుండిపోయాడు.

''ఎవరు నువ్వు?'' అని ప్రశ్నించిందా తేజోమూర్తి తానే. అగ్ని తేరుకున్నాడు. ''నన్నెరుగవా? అగ్నిని. జాతవేదుణ్ణి. సృష్టిలో నా ఆజ్ఞకు బద్ధంగాని దేదీ లేదు'' అన్నాడు.

''అంత శక్తిమంతుడవా నీవు?''

సమస్తలోకాలలోగల స్థావర జంగమ పదార్థాలను కాల్చి, బూడిద చేయగల సమర్థుణ్ణి. నా అంశలేనిదే జీవి బ్రతుకదు'' అన్నాడు అగ్ని.

''అందాకా వద్దులే. ఏదీ, ఈ గడ్డిపోచను కాల్చిచూడు'' అని ఆ దివ్యమూర్తి అగ్నిముందు ఒక గడ్డిపరకను ఉంచింది. అగ్ని తన సర్వ దాహశక్తిని ముప్పిరిగా ఆ గడ్డిపోచపైన ప్రయోగించాడు. మహాగ్నిజ్వాలలను కురిపించాడు. విస్ఫోటకములైన జ్వాలాకీలలకు కూడా గడ్డిపోచ రూపం చెడలేదు. కందలేదు. వడలిపోలేదు. అగ్ని తలదించుకున్నాడు. అవమానంతో తిరిగివచ్చాడు.

''మహేంద్రా! అగ్ని పరాజితుడైనాడు'' అన్నారు.

''ఏమిటీ? అగ్నికి పరాభవమా? వాయుదేవా! తమరు వెళ్ళిచూడండి! ఆ రూపం ఎవరిది? ఎవరాశక్తి?''

వాయుదేవుడు ప్రబల ప్రభంజనుడై వెళ్ళాడు.

''నీవెవరయ్యా?'' అని అడిగిందా దివ్యమూర్తి.

''నేనా? నన్నెరుగవా? మాతరిశ్వుడను. ముల్లోకాలలో సంచారం చేసేవాడిని. నేను లేనిదే చైతన్యం లేదు. ప్రాణం లేదు.''

''అంత శక్తివంతుడివటయ్యా.''

''సమస్త భువనాలలోగల సకల స్థావర జంగమాలను శ్వసింప చేసేవాణ్ణి నేను. అల్లల్లాడించే సమర్థుణ్ణి. నా పేరే మహా బలుడు.''

"అందాకా ఎందుకుగాని, ఇదుగో ఈ గడ్డిపోచను ఎగరగొట్టు నాయనా?"

వాయుదేవునికి భరింపరాని అవమాన మనిపించింది. గడ్డిపోచను ఎగురగొట్టాలా? వాయుదేవుడు తన నిశ్వాసాల ప్రబల ఝంఝలను వెలువ రించాడు. చెమటలు క్రక్కాడు. కాని గడ్డిపోచ కదలదే! ఇదేమి? ఎవరీ శక్తిమూర్తి?

"ఏమి వాయుదేవా? ఎవరాశక్తి?" ఇంద్రు డడిగాడు. వాయు దేవుడు అవమానంతో దించినతల ఎత్తలేదు.

ఇంద్రునికే ఆశ్చర్యమైంది. తానే స్వయంగా బయలుదేరాడు. అసుర విజయానికి తనకు బాసటగా నిల్చి మహా పౌరుష ప్రతిభలు ప్రక టించిన అగ్ని, వాయువులకు తెలియని ఆ దివ్యమూర్తి ఎవరు? ఇంద్రుడు అంతర్ముఖుడై వెళ్ళగానే అచ్చట ఎవ్వరూ కన్పించలేదు. ఇంద్రుడు ఆశ్చర్యంతో దిక్కులు వెదికాడు. ఒక విధమైన సమాధిలో ప్రవేశించాడు. ఆ దివ్యతేజం వెలువడ్డ వైపు దృష్టి నిలిపి జిజ్ఞాసలో పడ్డాడు. ఒక క్షణం తర్వాత సమస్త ప్రపంచ సౌందర్యాన్ని, మాహాత్మ్యాన్ని పుణికి పుచ్చు కున్న లోకపావని, జగజ్జనని ఉమాదేవి ఎదురుగా కన్పించింది. ఆమె రూపం మహాగ్నిలా స్వర్ణపుంజంలా, విద్యుల్లతలా మెరిసిపోతున్నది. ఇంద్రుడు ఉమను-అమ్మను గుర్తించాడు

"అమ్మా! నీవా తల్లీ! ఇంతకు ముందు దర్శన మిచ్చిన ఆ దివ్య తేజం ఎవరిది?"

"ఇంద్రా! ఆయన పరమేశ్వరుడు. అసుర విజయానికి తామే కారకులమని భ్రమలో పడివున్న నీ అగ్నికీ, వాయువుకూ, నీ సమస్త దేవతలకూ గుణపాఠం నేర్పవచ్చిన, సర్వశక్తిమంతుడైన లోక కళ్యాణ

కారకుడు. ఇంద్రా! దేవాసురులందరూ ప్రజాపతి పుత్రులే. అసురులు మీకన్నా బలవంతులు. అయినా మీకెలా విజయం లభించింది? మీలో పరమేశ్వరుడు ప్రవేశించాడు మీరు అసురులవలె, కేవలం శరీర జీవులు కారు. ఐహికములైన కోరికలు స్థిరమని నమ్మలేదు. కాని విజయాహంకారంతో 'నేనూ, నాది' అనే అసురత్వం మీలో ప్రవేశించింది. ఆ దుర్గతినుండి తప్పించడానికీ, తన శక్తిని జ్ఞప్తికి చేయడానికి, తిరిగి 'ఇదం న మమ' అనే మంత్రాన్నుపదేశించడానికి దయామూర్తి ఆ పరమేశ్వరుడు మీకు దర్శనమిచ్చాడు. అహంకారం, స్వార్థం అసుర భావాలు. అవి మీలో కూడా ప్రవేశిస్తే ఇక మీకూ అసురులకూ తేడా ఏమిటి?" అని అంతర్ధానమైంది లోకపావని ఉమ.

భారతీయులకు ఇదీ ఆదర్శం. సకల చరాచరంలో ఒక మహత్తర శక్తి, పరమేశ్వరుని దివ్య సంపద నిండి ఉన్నది. సృష్టిలో మనకు లభించింది. 'ఇదం న మమ' (ఇది నాదికాదు) "ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్, తేన త్యక్తేన భుంజీత మాగృధః కస్య స్విద్ధనమ్." సృష్టి అంతా పరమేశ్వరునిదే. అందు మనకు అవసరమైనంత నిస్వార్థబుద్ధితో, త్యాగభావంతో అనుభవించాలి. కృపణత్వం పనికిరాదు. "ఇది మన సొత్తుకాదు" అనే భావంతో ధర్మ కర్మ లాచరిస్తూ సర్వ సృష్టిలో విరాజిల్లే పరమేశ్వరుని సాక్షాత్కారించుకోవడం కొరకు, జీవితాన్ని ధర్మ కర్మలకు అంకితం చేసి అలా నూరేండ్లు జీవించడమే మానవ జీవనానికి సాఫల్యం. "కుర్వన్నే వేహ కర్మాణి జిజీ విషేచ్ఛదగం సమాః."

కర్మ ననుష్ఠిస్తూ, నూరేండ్లు జీవించు. నీకు పాపం అంటదు. అలా జీవించాలంటే "విద్యాంచా విద్యాంచ వేదోభయ గోసహా". పరమేశ్వర మైన ఆధ్యాత్మికమైన విద్యను, సమస్త భౌతిక విజ్ఞానాన్ని సమన్వయంతో

సాధిస్తూ, మృత్యు రహస్యాన్ని తెలిసి, అమృతత్వాన్ని సాధించడం మనకు ప్రభువు మార్గదర్శనం చేశాడు. అలాకాక శరీరమూ, ఐహికసంపదా నిత్యమనుకొని, సర్వాత్మ భావమును విస్మరించి నడిచేవారు అసురులు పొందే దుర్గతినే పొందగలరు. భారతీయులకు ఈ ఆదర్శమే సాధనమైంది. ఈ ఆదర్శమే ఇహపరాలను సమన్వయపరిచింది. ఈ ఆదర్శానికి దేశ కాల పాత్రలకు తగ్గ తత్వ, సదాచారాలు ఉద్భవించాయి. ఈ వ్యవస్థను సురక్షితంగా ఉంచుకుంటూ భారతీయులు తమ, జ్ఞాన, భక్తి, కర్మలను నిర్మాణం చేసుకున్నారు. ఋషులు, ఈ వ్యవస్థలో దివ్యతపస్సులనూ, యజ్ఞములనూ చేశారు. భక్తులు ఈ వ్యవస్థనే స్తుతించి కీర్తించారు. ఈ వ్యవస్థా రక్షణకే వీరపురుషులు తమ సర్వస్వాన్ని సమర్పించి, వీర స్వర్గం అలంకరించారు. కవులు కావ్యాలు వ్రాశారు శిల్పులు మహత్తర శిల్పాలను సృష్టించారు. సర్వ జీవన వ్యాపారమూ ఈ వ్యవస్థలో ఆ దివ్యా దర్శసాధనకొరకే నడిచింది.

సర్వసృష్టిలో సమత్వాన్ని, పరమేశ్వర శక్తిని గుర్తించి దాని కనుగుణంగా జీవించ సంకల్పించుకున్న భారతీయులకు చివరకీ స్వభావమే ప్రాణమైంది. శక్తి సమారాధన పుణ్యం. అశక్తి దౌర్బల్యం - పాపమనే విశ్వాసం అంకురించింది. ఈ ధర్మాన్నీ, వ్యవస్థనూ కాదన్నవారిని, దీన్ని నిరోధించి, నష్టపరచ దలచుకున్న వారిని భారతీయులు సామదానాదులతో అవసరమైతే దండంతో నిగ్రహించడానికి చేసిన చరిత్రే విజయదశమి చరిత్ర. దీనికై శక్తిని ఉపాసించడానికి హైందవజాతి చేసిన తపస్సే విజయదశమీ వ్రతం.

కల్పాంత సమయం, సృష్టిని మహాప్రళయం ఆవరించింది. మహావిష్ణువునుకూడా యోగమాయ ఆవరించింది. ఆయన అనంతజలరాశిలో నిద్రించివున్న సమయం. తిరిగి నూత్న సృష్టికి సమయ మాసన్నమైంది.

అప్పుడే విష్ణుకర్ణములోంచి పుట్టిన మధుకైటభులనే రాక్షసులు సృష్టికర్తనూ, చతుర్ముఖ బ్రహ్మను వధించాలని వెంటబడ్డారు. నూత్నమైన బ్రహ్మసృష్టి తిరిగి ఉదయించరాదని, అసురసృష్టిమాత్రమే సృష్టిని ఆవరించాలని వారి కోరిక. బ్రహ్మ విష్ణువును స్తోత్రమొనరించి మాయనిద్రనుండి మేల్కొలిపాడు. విష్ణువు మధుకైటభులను సంహరించాడు. బ్రహ్మ విష్ణు రుద్రులు త్రిగుణాత్ములు. విష్ణువు జగద్రక్షకుడు. అట్టివాడు నిద్ర త్యజించి, అలసట వదలి, కర్తవ్యాన్ని అనుష్ఠించి, దైవ సంపదలను నాశనం చేయాలనుకున్న అసురులను సంహరించాడు. 'నా విష్ణుః పృధివీ పతిః.' పృథివీపతిలో విష్ణుని గుణాలవతరించాలి.'అ విష్ణుః పృథ్వీ పతిః న.' విష్ణువు గుణాలు లేనివాడు పృధివీపతి కాడు - అనే ఆదర్శం అందుకే స్థిరపడ్డది. మధుకైటభులను వధించి విజయపర్వం జరుపుకున్నదీ విజయదశమినాడే.

ఇంద్రియజేతలైన దేవతలకు, ఇంద్రియోన్ముఖులైన అసురులకూ యుద్ధం వచ్చింది. అసుర నాయకుడు మహిషాసురుడు భౌతిక బలదర్పాలతో దేవతలను జయించాడు. వేదాలను దూషించాడు. యజ్ఞ విధ్వంసకుడైనాడు. ఋషులను, మునులను పీడించాడు. లోకాలను తల్లడిల్లచేశాడు. ఇంద్రుడు బ్రహ్మ, విష్ణులను ఆశ్రయించాడు ముగ్గురూ రుద్రుని ఆశ్రయించారు. ఈ మహిషుని సంహరించే శక్తి ఏ ఒక్కరిలోనూ లేదని, బ్రహ్మ విష్ణు రుద్రులూ, సమస్త దేవతలూ తమ అంతఃశక్తులను సమష్టిగా వెలువరించారు. ఆ వెలువడిన మహత్తర శక్తులలోంచి సింహ వాహినియై, సాయుధురాలైన మహాశక్తి ఉద్భవించింది. ఆ మహాశక్తి సర్వదేవతా ప్రతీకమై మహిషుని సంహరించి దైవీ సంపదను రక్షించింది. ఆ మహా విజయపర్వం జరుపుకున్నదీ విజయ దశమినాడే.

శుంభ నిశుంభులు వరప్రసాదులు, ఆ వరప్రసాద బలంతో లోకాలను తల్లడిల్ల చేసిన అతతాయులు. సర్వ వరప్రదాయిని యగు ఆది

శక్తి నుండి ఉద్భవించిన జగన్మోహినియైన ఒక సుందరిని చూచి మోహించారు. కాని ఆ జగన్మోహిని వారిని తిరస్కరించింది. శుంభ నిశుంభులు తమ సైన్యాన్ని పంపారు, ఆమెను బంధించి తెమ్మని. కాని ఆమె ఆ సైన్యాన్ని సంహరించింది. శుంభ నిశుంభులు కోపోద్రిక్తులూ, మోహితులూ అయి చండ ముండులనే ప్రబల శక్తిగల అసుర నాయకులను ఆమెను పట్టి తెండని పంపారు. కాని ఆమెలోని దివ్యశక్తి వారినికూడా వధించింది. అంతట శుంభ నిశుంభులు, వారి అనుచరుడైన రక్తబీజుడూ ఆమె నెదిరించగా ఆమె వారిని కూడా హతమార్చి లోక కంటకులూ, మోహగ్రస్తులు ఐన అసుర సైన్యాన్ని తుదముట్టించింది. ఆ మహాపర్వాన్ని జరుపుకున్నదీ విజయదశమినాడే.

రఘుమహారాజు అప్పుడే విశ్వజిత్ యజ్ఞంచేసి తన సర్వసంపదలూ పంచియిచ్చాడు. ఆయనకు మిగిలింది మట్టిపాత్రలు, మామూలు కట్టు గుడ్డలు. అప్పుడు వరతంతు మహర్షివద్ద సర్వ విద్యలూ నేర్చిన కౌత్సుడు గురుదక్షిణ ఇయ్యడానికి రఘుమహారాజును పదునాల్గు కోట్ల బంగారు నాణెములను యాచించాడు. రఘువు వద్ద ఏమీలేదు. తీరా ఇది తెలిసి తిరిగిపో సంకల్పించిన కౌత్సుణ్ణి మహారాజు ఆపాడు. ఒక మహా పరంపర అకుంఠితంగా నడవడానికి కావలసిన స్థైర్యమును సమాజములోని ప్రతి వ్యక్తికీ కల్గించవలసిన రాజు తాను స్నాతకుడై, గురు దక్షిణ కొరకు అట్టి రాజును యాచించడానికి వచ్చిన మనీషిని కాదని పంపడమా! రఘుమహారాజు కుబేరలోకం మీదికి దాడి చేయ సంకల్పించాడు. ధనుష్టంకారం విన్న కుబేరుడు తక్షణం కనక వర్షం కురిపించాడు. కాని కౌత్సునికి అంత ధనమెందుకు? తనకు కావలసింది తీసుకొని రఘును దీవించి వెళ్ళాడాయన. మరి మిగతాధనమో! అది తనదికాదు కదా! రఘుమహా

రాజు ఆ ధనాన్ని కూడా పంచిపెట్టాడు. ఆనాడు విజయదశమి. రిక్తుడైనా బహుశక్తితో కుబేర లోకాన్ని కదలించిన రఘుమహారాజు ఆయన జన్మించిన వంశమూ పరమాదర్శమై, భరతజాతికి మార్గదర్శనం అయింది.

త్రేతాయుగంలో రావణుడు ముల్లోకాలనూ జయించాడు. రావణుడు నవ వ్యాకరణవేత్త. సామవేద పారంగతుడు. పరమశివభక్తుడు. కాని జగన్మాతయైన జానకి బంధించినవాడు, ఋషుల యజ్ఞములను పాడుచేయబూనినవాడు సాధుజన కంటకుడైనాడు బలదర్పములతో నారీ ధర్మాన్ని; యజ్ఞయాగాదులనూ తిరస్కరించిన దశకంఠ రావణుని వధకై రఘుకుల సోముడైన శ్రీరామచంద్రుడు, కోదండమును ధరించి, లక్ష్మణహనుమదాది అనుచరులతో సముద్రానికి వారధి కట్టి, లంకను మెట్టి రావణుని కంఠములను త్రెంచి అసురశక్తిని సముద్రంలో ముంచడానికి విజయయాత్ర చేసిన దీనాడే. దశమినాడు పూర్వం బలనీరాజన పర్వం జరిగేది. రావణవధ జరిగిన తర్వాత స్వర్గమును చేరగనే ఇంద్రుడు లోకములలో శాంతి అభ్యుదయముల నెలకొనుటకు దేవసేనకు నీరాజనములిచ్చి గౌరవించినాడట అదే సంప్రదాయములు పాటించి రాజ్యపాలకులు విజయదశమి సందర్భంగా తమ సేనల పునర్నిర్మాణమును, వృద్ధిని, సంసిద్ధతనూ ఆశించి, పర్యవేక్షించి సైనికులను అభినందించే ఆచారమేర్పడింది.

ద్వాపరయుగంలో పన్నెండేండ్లు వనవాసం, ఒక ఏడు అజ్ఞాతవాసం గడిపి, ఆతతాయులైన కౌరవ చమువాహినులను చెండాడేందుకు విజయుడు శమీవృక్షము నుండి గాండీవం దించి ధరించిన దీనాడే.

విజయనగర రాజులు వియదశమినాడు మహోత్సవవాన్ని జరిపేవారు. నాటి మహ్మదీయ దురాక్రమణల నెదిరించడానికి సైన్యంలోకి సమాజంలో దాగియున్న యువశక్తిని ఆకర్షించడానికి బ్రహ్మాండమైన పోటీలు

ఏర్పాటుచేసి గెలపొందిన వీరులను గౌరవించేవారు. యోగ్యులను సైన్యంలో చేర్చుకునేవారు. పూజలుచేసి రాష్ట్రంయొక్క సమరశక్తిని, సన్నద్ధతనూ ప్రదర్శించేవారు. ఈనాడే శత్రువుల నోడించడానికి విజయ యాత్రలకు ఉపక్రమించేవారు.

హిందూ పద పాదషాహీని నిర్మాణ మొనరించిన మహా నాయకుడు శివాజీ అసుర మర్యాదను మాత్రమే పాటించిన విదేశీ, విధర్మీయులైన మహమ్మదీయులను ఉన్మూలించి, స్వరాజ్య, స్వధర్మ ప్రతిష్ఠకు ఈ రోజునే ఉపక్రమించేవాడు.

మహారాజా రంజిత్‌సింగ్ విజయదశమినాడు బ్రహ్మాండమైన ఉత్సవం జరిపి, అందులో యువవీరుల ప్రతిభాశక్తుల ప్రదర్శింపజేసేవాడు. అలాంటి ఒక ఉత్సవంలో మెరసిన రత్నమే హరిసింహ నీలువా. సీమోల్లంఘనం చేసి విదేశీయుల గుండెపై స్వదేశ పతాకను నాటిన మేటి రాష్ట్ర భక్తుడు. స్వదేశ రక్షణకు ప్రయత్నభూమి మన సీమల కావలనే ఉండాలనే పరమ రహస్యాన్ని వెలువరించి ఆచరణలో ప్రకటించిన రాజనీతి చతురుడైన మహాసేనాని.

చరిత్రలో దేవాసుర శక్తుల పోరాటం అనివార్యమైనప్పుడల్లా ఇలా ఈ విజయదశమితో సంబంధించిన ఏదో ఒక గాథ మనకు ఉజ్వలమైన ఉదాహరణను చూపెడుతూన్నది. మానవునిలో దైవభావం ఉండాల్సిందే, కాని దైవభావనను వ్యతిరేకించే పశుబలాలను నియంత్రించే శక్తి జాతిలో లేనప్పుడు ఎంత తత్వచింతన ఉన్నా ప్రయోజనముండదు. ''అగ్రతః చతురో వేదాన్, పృష్ఠతః సశరం ధనుః ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్రం, శాపాదపి శరాదపి''.

వేదములు పవిత్రములైనవే. కాని, ఆ వేదాలకు బ్రహ్మరథం పట్టాలంటే, దాని గౌరవాన్ని కాపాడ గల బుద్ధిశక్తితోపాటు, బాహుశక్తి

కూడ అవసరమే. శక్తిలేనిదే మంచికి నిలకడ యుండదు. ఆ శక్తి ప్రయోగం కూడా అన్నిసమయాల్లో అవసరం కాదు. శక్తి ఉన్నదనే విషయం ప్రకటింపబడితే చాలు. దుర్జనులు అణగి ఉంటారు. ఇది ప్రపంచ ధర్మం. ఇది మరచినట్లయితే పతనం తప్పదు. "శివశ్శక్త్యా యుక్తోయది భవతిశక్తిః ప్రభవితుమ్." సర్వలోక శివంకరుడైన శంకరుడైనా శక్తిని ఆరాధించక తప్పదు. ఆశక్తి ఉంటేనే ఆయన మహత్తు ఉండేది. శక్తి జీవనం. శక్తియే ఉపాస్యం. అశక్తుడు మృతప్రాయుడే.

శక్తి కూడ వ్యక్తిని ఆశ్రయించి మాత్రమే ఉండదు. ప్రపంచంలో విజృంభించే అసుర శక్తులను ఎదిరించడానికి, వ్యక్తిగతశీల సంపదా, పరాక్రమ సంపదా ఎంత అవసరమో, ఇవి కలిగిన వ్యక్తుల నిరహంకారమైన, నిస్వార్థమైన, సమన్వితమైన సమష్టిశక్తి అంతే అవసరం. అది లేనినాడు కూడా మంచికి పరాభవం తప్పదు. అందుకే సహస్ర శీర్షుడూ, సహస్రాక్షుడూ, సహస్రపాదుడూ అయిన రాష్ట్రపురుషుని ఆవిష్కృతి సమాజంలో నిత్య జాగృతంగా ఉండాలి.

భారతజాతికి ఇంత చరిత్ర ఉన్నా, ఇంత దివ్యమైన జ్ఞాన సంపద ఉన్నా, ఎందుకిలా పరాభవ పరంపరకు గురికావలసి వచ్చింది? విదేశీయులు తెరలు తెరలుగా, అలలు అలలుగా పైబడి, మన గౌరవ కేంద్రాలను నాశనం చేసినా, మన దేశాన్ని దోచినా, మనను శతాబ్దాల తరబడి బానిసలుగా ఉంచినా ఎందుకు ప్రతిక్రియ జరుగలేదు?ఇది మన ఆదర్శలోపమా? లేక మన అవగాహన ఆచరణల లోపమా?

ఒకసారి విజయదశమి చరిత్రను పరికిస్తే సమాధానం లభిస్తుంది.

మధుకైటభులు ఎవరో కాదు. విష్ణుమూర్తి చెవిలోని మలంనుండి ఉద్భవించారట. బ్రహ్మ విష్ణుపుత్రుడే. అలాంటి స్వజనులు కూడా మలి

నులై బ్రహ్మను, తన నాల్గు ముఖాలతో నాలుగు వేదాలను ఉద్గమింప జేసిన దివ్యమూర్తిని సంహరించడానికి పూనుకోగా నిర్మోహంతో విష్ణు మూర్తి వారిని వధించాడు. ఆత్మజాతులను వధించడానికైనా వెనుదీయని నిశ్చల ధర్మబుద్ధికి ఎంతటి మహత్తరమైన ఆదర్శం! దేశం కొరకు, ధర్మం కొరకు, స్వసంస్కృతీ సభ్యతల సంరక్షణ కొరకు బంధు పక్ష పాతం లేకుండా; అన్యాయానికి తలపెట్టిన వారిని స్వజనులైనా దండించ డానికి పూనుకోవాలంటే ఎంత గుణసంపద, ధర్మశీలం కావాలి! అది లేనిదే ధర్మం నిలువదు కదా! కనుకనే నాడు అట్టి ధర్మశీలం ప్రక టింపబడి, మధుకైటభుల సంహారం జరిగినది.

కాని అదే విదేశీయుల దండయాత్రలకు దేశం నలిగిపోతున్నప్పుడు స్వజనులే - వారు పరాక్రమవంతులే - ఆ విదేశీయులకు బాసటగ నిల్చి మన పరభవానికి కారకులైనారు, దీనికి ధర్మశీలం, సమాజశీలం లేకపోవ డమే కదా కారణం; జయసింహుడు, మానసింహుడు ఇల్లాంటివారు. ఆంగ్లేయుల కాలంలో వారి రాజ్య విస్తరణకు, రక్షణకు తోడ్పడ్డవారు మనవారే. అయినా దేశంపట్లా, ధర్మంపట్లా ఆ మమతాభావం, ఆ శీలం లేనివారైనందువల్లనే కదా! - దేశ ధర్మాదులకంటె తమ మహత్తును అధి కంగా చూచినందువల్లనే కదా వారి దురాచారానికి ఒడిగట్టినది.

ఆ విధంగా కాక బ్రహ్మ విష్ణు రుద్రులు మహోన్నతులైనా మహి షాసురుని వధించటానికి, తమరొక్కరొక్కరే ప్రయత్నించక తమ సర్వ శక్తులనూ సంఘటించి, మహాశక్తిని ఆవిష్కరింప చేసుకున్నారు. లేనిచో నాడు మహిషశక్తికివేర్వేరుగా బలి అగుటే తటస్థించేది కదా! నేను, నా పరా క్రమం అని అనుకొనుటలో కొంత తృప్తి కలగవచ్చును. కాని విజయసాధన కది మార్గం కాదు. గజనీ, ఘోరీ, బాబరు, అల్లావుద్దీన్, తుగ్లకు మొదలగువారు

వచ్చినప్పుడు తాము మహా పరాక్రమవంతులైనా, హిందూ రాజులు కలిసి పోరాడనందువల్లనే కదా పరాభవం పొందింది. తమ తమ వ్యక్తిగతము లైన అహంకారములకూ, స్వార్థములకూ, కక్షలకూ అలా దేశాన్ని ఆహుతి చేశారు కదా! అదే సెల్యూకస్ వచ్చినపుడు, అలెగ్జాండరు వచ్చి నపుడు ప్రజలశక్తిని సమీకరించినందువల్లనే కదా చంద్రగుప్త చాణక్యులు విజయం పొందింది. ఔరంగజేబు వంటి క్రూరుని సహితం ఎదిరించి నిల్వగల్గిన శివాజీకి ఈ సమష్టి శక్త్యుపాసనే కదా తోడ్పడింది.

చరిత్రలోంచి మనకి గుణపాఠం అడుగడుగునా కన్పడుతుంది. ఇది స్వదేశం, ఈ స్వదేశంలో స్వధర్మం ఒకటున్నది. దాని అనుష్ఠానమే నా కర్తవ్యం, నా స్వభావం. దాని ననుష్ఠించడానికి తగిన వాతావరణ పరిస్థితులుగల వ్యవస్థను నిర్మాణం చేసుకొని ఉంచడమే స్వరాజ్యం. ఈ సమాన భావనగలవారి సమాజ సమష్టి రూపమే రాష్ట్రమై, వారి సమష్టి శక్తియే రాష్ట్ర శక్తిగా రూపొందుతుంది. రాష్ట్ర శక్తి ఉద్దీప్తంగా ఉన్న నాడు తాత్కాలికంగా ఏదైనా కష్టం వచ్చినా రఘుమహారాజులా కుబేర రాజ్యాన్ని కదిలించగల పౌరుష ప్రతిభలు ప్రకటించవచ్చు. ఈ స్వదేశ స్వధర్మ స్వరాజ్యాల ఆచరణ జ్ఞానం పోతే ప్రజలుస్వభావం కోల్పోయి బానిసలవుతారు. అప్పుడు వారిలో ఐక్యత వుండదు. సంఘటన ఉండదు. మమకారమూ, పరస్పర ప్రేమా ఉండవు. విశ్వాసం ఉండదు. బలం ఉండదు ప్రపంచంలో ప్రతి అసమర్థ దుర్జనుడూ వారిని బెదరించగలుగు తాడు. వాడు అందరి నోళ్ళపడే గ్రాసంలా తయారవుతాడు. ఈ జ్ఞానం నిరంతరం కల్గించే వ్యవస్థ పోతే దేశం స్వత్వం కోల్పోతుంది. దీనికి మన చరిత్రే సాక్షి.

మన దేశం మీదికి యవనులు, శక, హూణ, మహ్మదీయ, యూరోపీయ జాతులు దండయాత్రలు చేశాయి. స్వదేశ, స్వధర్మ,

స్వరాజ్య భావజ్ఞానం దాని ననుసరించిన ఆచరణా, సమాజంలో జాగ్రత్తంగా ఉన్నప్పుడు ప్రబల శక్తులను ఎదిరించగల పరాక్రమాన్ని ఈ దేశం ప్రదర్శించ కలిగింది. ఈ సద్గుణాలు లోపించినపుడు విదేశీయులు, విధర్మీయులు ఎంత అనాగరకులైనా అల్పులైనా ఈ దేశాన్ని గెలిచి ప్రళయాన్ని సృష్టించగలిగారు.

విజయదశమి మనకిచ్చే సందేశం ఇదే. అందుకే నవ యుగానికి స్వదేశ, స్వధర్మ, స్వరాజ్య సంరక్షణలకు ఆధారభూతమైన రాష్ట్రశక్తిని ఉపాసించే రాష్ట్రీయ స్వయంసేవక సంఘాన్ని, పరమ పూజనీయ డాక్టర్ కేశవరావ్ బలీరామ్ హెడ్గేవార్‌గారు ఈ రోజున ఆవిష్కరింప చేశారు.

సంఘం చారిత్రకమైన ఒక మహా అవసరాన్ని పూరించడానికి జన్మించింది. ఇది మన దేశం, అంటే హిందూ దేశం. కాని మనం అజాగ్రత్తగా ఉండిన ఘడియల్లో అనేకులు ఈ దేశం మీదికి దాడి చేశారు. వారి జీవన దృక్పథం వేరు. ఈ దేశస్థులే కొందరు బలహీన మనస్కులు వారిలో చేరారు. నిద్రాణంగా పడి ఉన్న ఈ జాతిని ఆ పరాయివారు పరిపాలించడమే కాక, ఈ జాతి స్వరూప స్వభావాలను మార్చడానికి నిరంతరం ప్రయత్నించారు. ఈ దేశపు ప్రజలలోంచి "స్వత్వభావా"న్ని తొలగించందే, ఈ దేశాన్ని శాశ్వతంగా పరిపాలించలేమని ఆంగ్లేయులు గ్రహించాలి. అందుకే ఈ దేశ చరిత్రను అసత్యపు పునాదుల మీద వ్రాశారు. సామ్రాజ్యవాదులుచేసే పనే ఇది. ఈ దేశాన్ని ఒక దేశం కాదు- ఇదొక ఉపఖండం అన్నారు. ఇక్కడ నివసించే ప్రజలందరూ బైటినుంచి వచ్చిన వాళ్ళేనని ప్రచారం చేశారు. హిందువులు ఒక జాతి కాదన్నారు. హిందువులు ఒకటిగా ఎన్నడూ జీవించలేదన్నారు. భారతదేశంలో ఉన్న జనం వేరు వేరు సమయాల్లో వచ్చి చేరిన ప్రజా సమూహం అని

అన్నారు. దీర్ఘమైన మైకంలో పడ్డ మనం స్వార్థపరులమై క్రమంగా ఆత్మ జ్ఞానాన్ని పౌరుష మర్యాదలనూ స్వపర విజ్ఞానాన్ని కోల్పోయాం. పరాయి వారి మాటలు నమ్మాము ఇలా హిందూ దేశంలో హిందూ జాతి ఆధారం లేని జాతి ఐంది. మహమ్మదీయులు, క్రైస్తవులు ఈ భిన్న భిన్న జాతులూ ఈ దేశాన్ని క్రీడాకందుకంగా భావించారు. కోటానుకోట్ల సంఖ్యగల హిందువులు ఎవరికి వారుగా స్వదేశ, స్వధర్మ స్వరాజ్య భావాలను మరచి "బ్రతికియుండిన సుఖములు బడయవచ్చు" ననే భావంతో, సర్దుబాటు మనస్తత్వంతో జీవచ్ఛవాలై జీవించ నారంభించారు. ఆత్మవిశ్వాసం కోల్పోయి, ఎవరికి వారై ఏకాకులైనారు.

ఈ పంకిల స్థితిలోంచి ఎలా బయటపడడం? పూజ్య డాక్టర్‌జీ ఈ చరిత్రను సమీక్షించి నిష్కర్షతీసిన సత్యమే రాష్ట్రీయ స్వయంసేవక సంఘంగా ఆవిష్కరించింది.

హిందూజాతిదీభూమి. హిందూధర్మమే ఈ భూమిధర్మం. హిందూ ధర్మానుకూల సర్వ వ్యవస్థలే ఈ దేశానికి స్వభావ పోషక వ్యవస్థలు. హిందువులు, ఆసేతు శీతనగవాసులు, ఏకోదరులు. వీరిలోని స్వార్థము, వీరిలోని అహంత, వీరిలోని ఇతర దుర్గుణాలు తొలగి, ఒక ప్రబలమైన శక్తిగా, ఒకే సంఘటనగా రూపొందిననాడే ఈ జాతి స్వభావం రక్షింపబడుతుంది. "సంఘే శక్తిః కలౌయుగే. కలిలో సంఘటన శక్తియే సర్వ సమస్యలకు దివ్యమైన ఔషధం" అని పూజ్య డాక్టర్‌జీ ఉద్బోధించారు. ధర్మం గొప్పది కావచ్చు సంస్కృతీ, సభ్యతా, వేదాంతాదులూ గొప్పవే కావచ్చు. వ్యక్తిగతంగా హిందువు శ్రేష్ఠుడే కావచ్చు. కాని ఏకాకులైన వీరిని ఒకచోట చేర్చి, వీరిలో ఉన్న వేర్వేరు కర్తవ్యశక్తులకు ఒక మహా సమైక్యరూపం ఇచ్చి, దివ్యమైన జీవనాదర్శాలను, ఆ ఆదర్శాల నిలయమైన భూమిని రక్షించుకోగల ప్రబలమైన శక్తిని నిర్మాణం చేస్తేనే, దీనికై అహర్నిశలు, సర్వమూ పణంగా పెట్టి పనిచేసే, తరతరాలను

సృష్టిస్తేనే ముక్తి కలుగుతుంది అనే మంత్రాన్ని పూజ్య డాక్టర్‌జీ ప్రకటించారు. నేటి హిందువు ఇతరుల దయాదాక్షిణ్యాలమీద బ్రతికేవాడు. హిందూ సంఘటన ప్రబలంగా రూపొందనందుననే తన మాతృభూమిని రెండుగా ఖండించుకున్నాడు. ఆ ఆత్మ చైతన్యం లేనందువల్లనే ఒకవైపు చైనా, రెండవవైపు పాకిస్తాన్ ప్రత్యక్షంగాను; రష్యా, అమెరికాలు పరోక్షంగానూ ప్రజలలో జాతి, కుల, వర్గ, సంప్రదాయాలపేర వికృతాలు సృష్టిస్తున్నా హిందువు సత్యాన్ని గుర్తించలేని మైకంలో పడి ఉన్నాడు. ఈ సమస్త దుస్థితుల్లో ధీరంగా, చలించకుండా, పదే పదే ఈ పరిస్థితులకు గుర్తుచేస్తూ, లక్షోప లక్షలుగా హిందువులను సమీకరించి, వారిలో మాతృభక్తిని, పరస్పర ప్రేమసౌహార్దాలను నిర్మించి, అట్టి వారి సమైక్యతతో ప్రజల సంఘటనను ఏర్పరచి, ఆ సంఘటన ప్రభావాన్ని సమాజ జీవనంలోని సర్వ రంగాలకు ముద్రించి, హిందూత్వ దీప్తులను వెలువరించడానికి, హిందూ రాష్ట్రాన్ని హిమాలయమంత శక్తిమంతంగా, ధీరంగా, ఉన్నతంగా, సముద్రమంత గంభీరంగా విస్తృతంగా సర్వవ్యాప్తంగా నిర్మించడానికి రాష్ట్రీయ స్వయం సేవక సంఘం ఈ విజయదశమీచరిత్ర శృంఖలలో నవబంధంగా అవసరమైన అనుబంధంగా అవతరించింది.

ఈ విజయదశమినాడే సంఘస్వరూపం ఆవిష్కరించడం హేతుబద్ధమేకాక, చరిత్ర తపించిన ఒక అవసరం. సంఘటన శక్తిని తిరిగి ఉద్గమింపజేయగల ఈ మహత్కార్యానికి కల్పాంతం నుంచి భారతవర్షం అసురులతో జరుపుతున్న సంఘర్షణ చరిత్రలో తుది ఘట్టాన్ని సాక్షాత్కరింప చేసుకోగల శక్తిని ప్రసాదింపమని ఈ విజయదశమినాడు, శక్తిపూజతో, సీమోల్లంఘన వ్రతంతో, సమష్టి రూపుడైన సమాజ పరమేశ్వరుని పూజిద్దాము.

# మకర సంక్రాంతి

దేశంలో పెద్దపెట్టున ప్రజలు జరుపుకునే ఉత్సవాలలో సంక్రాంతి ఒకటి. అసలు సంక్రాంతి అనగా చేరుట - అనగా ఒకదానిలోకి పూర్తిగా ప్రవేశించుట అని అర్థము. సూర్యుడు నెలకొక రాశిలోకి చేరుతాడు. అలా పన్నెండు నెలలలో పన్నెండు రాశులలో చేరే ప్రతికాలం సంక్రాంతియే. ఇలా ఏటా పన్నెండు సంక్రాంతులు వస్తాయి. అయితే మకర సంక్రాంతికి ప్రత్యేకత ఉన్నది. మిగతా సంక్రాంతులలో ప్రకృతిలో మార్పు అంత స్పష్టంగా గోచరించదు. కాని మకరం లోనికి సూర్యుడు ప్రవేశించగానే ప్రకృతిలో ఒక మార్పు వస్తుంది. మార్గశిరం వరకు దక్షిణాయణం. ఆ తరువాత ఆరు నెలలు ఉత్తరాయణం. మొదటి ఆరునెలలు సూర్యుడు దక్షిణాభిముఖుడై ఉంటాడు. కనుక ఆ కాలానికి దక్షిణాయణమని, తర్వాతి ఆరునెలలు ఉత్తరాభిముఖుడుగా వెలుగొందుతూ ఉంటాడు గనుక ఉత్తరాయణమని వాడుక వచ్చింది.

దక్షిణాయణం ఆరు నెలలు వానా, చలీ, చీకటీ ఎక్కువ. ప్రతిచోటా చిత్తడి, ప్రకృతి పరంగా అనారోగ్యమైన కాలం. ఉత్తరాయణం రాగానే ప్రకృతిలో మార్పు వస్తుంది. పంటలు ఇంటికి చేరి, గరిసెలు నిండుతవి. సమృద్ధి ఉంటుంది. దక్షిణాయనం చావడానికి కూడ పనికిరాని కాలం. అందుకే కురు పితామహుడైన భీష్ముడు ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చిందాకా అంపశయ్యపైన పరుండి, ఉత్తరాయణం రాగానే ప్రాణం విడిచాడు.

మకర సంక్రమణం, పాతపోయి కొత్తదనానికి స్వాగతం పలికే రోజు. ప్రచండ తేజస్కుడైన సూర్యుడు తన దివ్యకాంతులను ప్రజ్వరిల్ల

చేస్తూ ప్రకాశిస్తాడు. రాత్రుల కాలం తక్కువవుతుంది. ప్రకృతిలో నవ తేజం నిండి కన్పిస్తుంది.

దీనినే తిల సంక్రమణం అని కూడా అంటారు. సంక్రాంతికి ముందు రోజు భోగి. భోగిమంటలతో పాతకు స్వస్తి చెప్పి నవ్యతకు స్వాగతం పలుకుతాం. సంక్రాంతి నాడు నువ్వులు, బెల్లం కలిపి, ప్రసాదం స్వీకరిస్తాం. ఆనాడు పితృదేవతలకు తర్పణలు విడుస్తాం. వారి ఉత్తర గతులు ప్రశస్తములై ఉండేందుకు దానధర్మాలు చేస్తాం. దీనికి మ్రొక్కుల పండగ అని ప్రశస్తి ఉన్నది. ఈనాడు పెద్దల ఆశీస్సులను కోరి వారికి పిన్నలు నమస్కరించడం పరిపాటి. ఇదే పంటలు ఇంటికి చేరుకునే కాలం. సంవత్సరమంతా కష్టించి పండించుకున్న పంటను కళ్ళంలో రాసిపోసి, పొలిపెట్టి, వచ్చిన యాచకులందరికి "ఇదం న మమ" అని పంచిపెడతారు. కాదనక కలిగింది చేటలతో పంచి, మిగిలింది తాననుభవించే ఈ సంప్రదాయం వెనుక ఎంత మహత్వంతో కూడిన ఔదార్యం కన్పిస్తుంది: తన పంట తన కొరకే కాదు, అవసరమున్న అందరికీ. సంక్రాంతి రోజుల్లో ఎక్కడ చూచినా సంపదే. గంగిరెద్దు ఆటలూ, హరిదాసు భజనలూ' దొమ్మరి గారడీలు, పగటి వేషాలూ, వీధి భాగవతాలూ, తోలు బొమ్మలాటలూ, హరికథలూ, కూచిపూడి నాటకాలూ...ఊరూరా ప్రజలకు మన సంప్రదాయాన్ని తెలియజేసే ఈ వేడుకలు ఆనందోత్సాహాలను పంచి పెడుతుంటాయి.

ప్రతి పండుగా ఒక విశేషమైన సందేశాన్నిచ్చేదే. ఆ సందేశాన్ని సరియైన అర్థంలో గ్రహించి, దాని ననుసరించి ఆచరించడమే ఆ పండుగలను చేసుకోవలసిన సరియైన పద్ధతి. కాని దురదృష్టవశాత్తు మన పండుగలన్నీ కేవలం వేడుకలుగానో లేక వ్యక్తి పుణ్యాన్నో, సంపదనో ఆశించి చేసే వ్రతాలుగానో మిగిలిపోయాయి. మకర సంక్రాంతి కూడా అంతే,

సృష్టిలో ఏ సామాన్యయనియమాలు ఉంటాయో - అంటే, ఏ సామాన్య నియమాల ననుసరించి సృష్టి నిలుస్తున్నదో, అట్టి సామాన్య నియమాలే సృష్టిలో ఒక భాగమైన మానవుని, మానవ సమూహాలని నియమిస్తాయి. మార్పు అనేది సృష్టి నియమం. ప్రతి క్షణం సృష్టిలో మార్పు అనేది వస్తూనే వుంటుంది. మానవ శరీరం ప్రతిక్షణం మారుతూనే వుంటుంది. అలాగే సమాజాలలో కూడా మార్పు వస్తూ ఉంటుంది. కాని ఈ మార్పులతో పాటు మారని వస్తువుకూడా ఒకటుంటుంది. శరీర స్థితి వయసునుబట్టి మారినా శరీరంలోని "నేను" చివరిదాకా "నేను"గానే ఉంటుంది కదా!

గతం నుంచి ఉత్సాహ స్ఫూర్తులు పొందుతూనే వచ్చే మార్పుకు స్వాగతం పలుకుతూ జీవనయాత్రలో తను ఉనికిని మనుగడను కోల్పోకుండా నిల్దొక్కుకొని నిలగలగడమే జీవుల లక్షణం. దీనిని గ్రహించడానికి సృష్టిలో వ్యాపించియున్న సమరస భావాన్ని, సమన్వయాన్ని గుర్తించక తప్పదు. సృష్టిలోని ప్రతి జీవికీ ప్రాణం ఇచ్చేది, నిల్పేది సూర్యుడు. పరమ కరుణామయుడైన సూర్యుడు ప్రాణకోటికి చైతన్యం ఇస్తాడు. ఒక కవి సూర్యుని కర్తవ్య నిష్ఠను ప్రశంసిస్తూ "ఒంటిచక్రరథం, పాముల పగ్గాలు, ఏడుగుర్రాలు, దారి ఆధారం లేనిది, సారథి చూద్దామా కాళ్ళు లేనివాడు. అయినా సూర్యభగవానుడు అంతులేని ఆకాశంలో ప్రతిరోజూ పయనిస్తూనే ఉంటాడు. "క్రియా సిద్ధిః సత్త్వేభవతి మహతాం నోపకరణే" మనకు సత్త్వం ఉంటే పనులెన్నైనా నిర్విఘ్నంగా నెరవేరుతాయి; గొప్ప గొప్ప సాధనలుంటే సరిపోదు అని వర్ణించాడు.

ఒక్కొక్కరికి ఒక్కొక్క సత్వముంటుంది. ఆ సత్వము వారి విశిష్టత. అది వారి సొత్తు. ఇట్టి సొత్తును గూర్చిన ఆత్మీయతా భావనయే "స్వ"త్వ భావన, ఆ "స్వ"త్వ భావన జాగృతంగా ఉన్న జాతికి చావు లేదు. మన సర్వపర్వాలలో ఏదో రూపంలో ఈ సతాన్ని (సొంతధనాన్ని) నిత్య జాగృతంగా ఉంచడానికి ప్రయత్నించినట్లు కన్పిస్తుంది.

మానవ జీవితం ఏకాకి కాదు. సృష్టిలో ఏదీ వ్యష్టినిష్ఠం కాదు. ప్రతీదీ పరస్పరాశ్రితమే. సమాజంలో ఒకరి నొకరి ఆశ్రయించి బ్రతుక వలసిందే. 'స్వత్వ' భావం ఉంటే, వ్యవహరించుకునే తీరు వేరు. అది లేనినాడు పరస్పర వ్యవహారం కేవలం వ్యాపార సరళిలో, స్వార్థం కొరకు మాత్రమే నడుస్తుంది. స్వత్వహీనులైన వ్యక్తులుగల సమాజానికి చేవ ఉండదు, నిర్ణయం ఉండదు. "నా" అనే మాట వాడుకమాట కాదు. అది సంస్కార సంబంధం కలది. ''స్వ'' అంటే ''నా''. ఈ ''నా'' అనే భావన ఏ వ్యక్తుల సమూహంలో కలగాలన్నా, వారిలో కొన్ని సహజ లక్షణాలుండాలి. అనగా తనవలె నమ్మి, భావన చేసి స్ఫూర్తిపొంది, తనవలె స్పందించిన వ్యక్తులలోనే "స్వ"భావం ఉంటుంది. ఆ "స్వత్వ" భావం ఒక్కొక్క జాతి ఆర్జించుకున్న మహా సంపద. జీవనయాత్రలో ఒక సమాజం సాగించిన మహాప్రయాణంలో ఆ 'స్వ' భావ పేరితులు కలిసి పడిన కష్టాలు, అనుభవాలు, అనుభవించిన సుఖాలు, స్వప్నాలు, తరతరాలుగా కలిసి ఒక సంపుటిగా తరాలవారీ అ 'స్వ'భావంకల జనులకు స్ఫూర్తినిస్తాయి. అది వారి మనుగడకూ దర్పణమవుతుంది. దాన్ని నిలబెట్టుకోడానికి జరిగే ప్రయత్నమే ఆ ప్రజల చరిత్ర. కాలాలు మారవచ్చు. తరాలు మారవచ్చు. రూపసాదృశ్యాలు మారవచ్చు. కాని ఆ 'స్వ'భావం నిరంతరం సాగిపోతూనే ఉండాలి. ఆ అనుబంధం నిరంతరాయమయ్యే ఉండాలి. దానికై ప్రతీ వ్యక్తీ తానొకడే అనే భావనకాక; తన లాంటి సర్వుల వలయమే తనకు స్ఫూర్తి కేంద్రమనీ, దానికై తాను పదుగురిలో ఒకడై, తనలో పదుగురిని దర్శించుకోవాలనీ భావిస్తాడు.

"స్వత్వం" గల జనం కలిసి తమ భూమిలో, తమ సమూహంలో, తమ గతం, ప్రస్తుతం, భవిష్యత్తులలో ఒకే ఆవేశాన్ని, ఒకే ఆశయాన్ని, ఒకే అంతర్నాదాన్ని అనుభవిస్తారు.

పై పై మార్పులు రావచ్చు. సృష్టిలో పాతపోయి క్రొత్త రావచ్చు. కాని పరంపర చెడదు. అనుస్యూతత చెడదు. అదే ధార-అదే ప్రవాహం. గంగవలె నిర్మలంగా, అనవరతమూ, అనంతంగా ప్రవహిల్లే "స్వత్వ" భావననే రాష్ట్రీయ భావం అంటాం. ఈ స్వభావం కలవారే రాష్ట్రంగా రూపొందుతారు. వారి సమూహచరిత్రే ఆ రాష్ట్ర చరిత్ర.

రాష్ట్రంగా రూపొందిన ఆ జనంలోని అంతర్నాదం ఎంత స్ఫుటంగా, దోషరహితంగా, లయబద్ధంగా, మధుర స్వరయుక్తంగా ఉంటే ఆ ప్రజల రాష్ట్రభావన అంత అమృతంగా ఉంటుంది. స్నేహయుక్తమూ, మధురమూనైన ఈ అంతర్నాదాన్ని పరస్పరం ఒకరిలో ఒకరు వినదగిన స్థితి అజేయ రాష్ట్రస్థితికి నిదర్శనం.

దీనిని స్ఫురించ చేయడానికే - కాబోలు సంక్రాంతి నాడు బెల్లం, నువ్వులు కలిపి దంచిన చిమ్మిలి పంచుకుంటారు. బెల్లం మాధుర్యానికి లక్షణం. నువ్వులలోంచి నూనె వస్తుంది. నూనెకు స్నేహమని పేరు. జీవనంలో మధురమైన వ్యవహారం, స్నేహం ఎంతో అవసరం కదా! వ్యక్తి జీవనం సుఖంగా, ఆనందమయంగా, స్నిగ్ధంగా నడపడానికి మధురమైన ప్రవర్తనా, స్నేహశీలమూ ఎంతో అవసరము. అలాంటప్పుడు జీవనంలో పరస్పర వ్యవహారంలో ఈ గుణాలు ఎంత అవసరం! మాధుర్య స్నేహాలు వ్యాపార విషయాలు కాదు. అవి హృదయానుభూతులు. మాధుర్య స్నేహాలు నిర్హేతుకాలు కావాలి. ఏదో ఫలితం కోరి, దానికై ప్రవర్తన కాదు. అది సహజమై వెలుగొందాలి. సహజంగా మాధుర్య స్నేహాలు ప్రకటింపబడాలంటే ఏదో ఒక బంధం ఉండాలి. ఏదో ఒక స్పందన కలగాలి. "స్వత్వం" కంటే మించిన బంధం, స్పందన మరొకటుంటుందా? కనుకనే ఈ స్వత్వ భావనను, పరస్పర మాధుర్యాన్ని స్నేహాన్ని ప్రకటించే ఈ "తిల (నువ్వులు), గుడ (బెల్లం)" ప్రసాద పద్ధతి ఏర్పడ్డది.

అలాగే సూర్యుని ఉదాహరణ. ఎంత నిష్కామకర్మ! చేతనజగత్తు కంతటికీ ప్రాణదాత అయినా విరామ మెరుగడు. సర్వజీవులకూ సమాన హితం కూర్చేవాడు. స్తుతి నిందల కతీతుడు. కార్యసాధనకు కావలసిన లక్షణాలు ఇవి. నిర్విరామ కృషి, నిరహంకారతపం-ఇవి లేనిదే మహత్తరా దర్శాలు సాధింపబడడం సాధ్యమా?

జీవితం అనుదినం మార్పు చెందుతూ ఉంటుంది. ఆ మార్పులలో అసలు రూపం ఏ మాత్రం పోదు. సమాజ జీవనం ఒక మహాప్రవాహం లాంటిది. ఆ ప్రవాహంలో ఒక తరంపోయి మరొక తరం వస్తుంటుంది. మార్పు వచ్చినప్పుడల్లా వ్యవస్థే మారితే జాతిజీవనానికి అనుస్యూతత, బలం ఉండవు కనుకనే రాష్ట్ర జీవన ప్రవాహాన్ని అసంక్షుబ్ధంగా, నిరంతరాయంగా ఉంచడానికి సంతత ప్రయత్నం కావలసి ఉంటుంది. ఆ సంతత ప్రయత్నం జరిపే వ్యవస్థే లేకపోతే ప్రయత్నం కూడా ఆగి పోతుంది.

ఆ వ్యవస్థ కూడా నిరాధారం కారాదు. రాష్ట్ర జీవనానికి ఆధారం స్వత్వ భావనే కదా! మరిదాన్ని నిలబెట్టే వ్యవస్థలకు ఆధారం సమాజమే కదా! అలా సమాజం కొరకు, సమాజమే ఈ వ్యవస్థను కాపాడుకొని కాలాన్ననుసరించి, రాష్ట్రశక్తిని అజేయంగా నిలపాలంటే ఆ సమాజం లోని వ్యక్తులలో సూర్యుని అంతటి నిష్కామ కర్మభావం, ఓజస్వితలతో పాటు పరస్పర స్నేహ మాధుర్యాలుకూడా పోషించే శక్తి వుండాలి. అది పోతే సమాజంలో పరస్పర విశ్వాసం ఉండదు. ఆత్మీయత ఉండదు. కర్మనిష్ఠ ఉండదు. ప్రఖరతేజం ఉప్పతిల్లదు. ఒకరినొకరు ఆదుకోవడం ఉండదు. అంటే వ్యక్తి తన సమష్టి రూపాన్ని గ్రహించి, నిలుపుకునే 'స్వ' భావాన్ని కోల్పోతాడన్నమాట! అలా కోల్పోయిన ప్రజ - ఆ ప్రజ ఎంత సంఖ్యలో ఉన్నా - ఆ జాతి పరాభవం పొందక తప్పదు.

మన సమాజానికి పట్టిన వ్యాధి అచ్చంగా ఇదే. మనదేశం విశాల మైనదే. మనకు స్ఫూర్తినిచ్చే శక్తి మన ధర్మానికీ మన పూర్వ చరిత్రకూ సంస్కృతీ సభ్యతలకూ విపులంగానే ఉన్నది. కాని సుదీర్ఘ చరిత్రలో కర్మనిష్ఠను నిశితంగా నిరంతరంగా కాపాడుకోవలసిన అవసరం బహుశః కొంతకాలం స్ఫురించకపోయినందున దేశంలో అలసత్వంతో పాటు వ్యక్తినిష్ఠ ప్రబలింది. 'ఎవరికి వారే యమునాతీరే' ధోరణి ప్రబలింది.

ఉత్తరాన శత్రువులు దాడి జరిపితే దక్షిణాన మనకేమిలే అని సమాజం భావించింది. అదే ప్రాదేశిక విభేదాలను సృష్టించింది. కుల భేదాలను తెచ్చింది. వ్యక్తి గౌరవ ప్రతిష్ఠల ప్రాముఖ్యాన్ని పుట్టించింది. సమాజంలో ప్రేమ, సద్భావం, సమైక్యత, మాధుర్య పూర్ణ వ్యవహారం నశించి, "వ్యాపార సరళి" జీవనం వ్యాపించింది. కులం పేర, ప్రాంతం పేర, మిగతా కారణాలుగానూ పేరుకున్న విభేదాలు పరస్పర శత్రుత్వాన్ని పెంచేదిగా తయారై, మనకు మనమే విరోధులమయ్యే పరిస్థితి ఏర్పడింది. సమాజ సత్వ భావనకు అవసరమైన పోషణనిచ్చే వ్యవస్థలో చేవపోయింది.

దీనివల్ల హిందూ సమాజం యొక్క పైపై రూపం మిగిలి, లోపల డొల్ల అయింది. ఈర్ష్య, ద్వేషం, అహంకారం, స్వార్థం, కరుడుగట్టి సమాజంలోని పరస్పర వ్యవహారంలో అవి కన్పించి, చీలిక పేలికలుగా సమాజాన్ని తయారుచేసినవి. శత్రువులు అలాంటి సమాజాన్ని గెలవడం ఎంత తేలిక !

గజనీ మన దేశానికి వచ్చాడు. ఆనాడు భారతీయులలో పౌరుష ప్రతిభలకు అంతులేదు. కాని దక్షిణ భారత రాజులకు ఈ స్పృహలేకపోగా ఉత్తర భారత రాజులలో ఐక్యత లేదు. వేరు వేరుగా ప్రతివాడూ వీరుడే,

కాని కలిసి పోరాడలేని దురదృష్టవంతులు. ఈర్ష్యా ద్వేషాలతో ఒకరి మేలు మరొకరు సహించని అల్పులు. సమస్త భారతానికి పవిత్ర కేంద్రం ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటయిన సోమనాధ శివమూర్తిని భంజించడానికి శత్రువు వస్తున్నాడని తెలిసి కూడా ఒకటై పోరాడి ఎరుగని క్షుద్రులు. మరి దీనికి కారణం? ఆ మమత్వం చచ్చిపోవడమే. ఇది నా మాతృభూమి. 'మాతా భూమిః పుత్రోహం పృధివ్యాః.' ఈ పుడమి నా తల్లి; నేనామె పుత్రుడ ననే భావం నశించింది.

ఘోరీ వచ్చి ఎన్నిసార్లు పరాభవింపబడి తిరిగిపోయినాడు! కాని జయచంద్ర, పృథ్వీరాజుల వ్యక్తికలహం దేశ మర్యాదా స్వాతంత్ర్యాలను నాశనం చేసింది. ఇదికూడా ఆ మమత్వం లేకనేకదా! మనలో తగవులుంటే మనం తీర్చుకుందాం. విదేశ, విధర్మ శత్రువును ఎదిరించ వలసి వస్తే ధర్మరాజు అన్నట్లు 'వయం పంచాధికం శతమ్' మేము నూటైదుగురము అని నిలవాలి కదా! అలా నిలవాలంటే ధర్మరాజన్నట్లు 'కౌరవులు మన సోదరులు' అనే భావం ఉండాలి.

ప్రతాపసింహుని పట్ల మానసింహుని ప్రవర్తనా, మిగతా అనేక ఘట్టాలు ఈ మమత్వం లేమికి నిదర్శనాలే. మమత లేమితో ఐక్యత కూడా పోతుంది. అప్పుడు ఎవరికి వారే.అలాంటి వారందరు ఉంటే ఏమి? వేర్వేరుగా ఎంత పౌరుషం ఉంటే ఏమి? వేర్వేరుగా ఎంత చాతుర్యం ఉంటే ఏమి?వేర్వేరు ఎంత ధార్మికులైతేనేమి? దాని సమ్యగ్ రూపాన్ని గుర్తించక, ప్రవర్తనలో సమాజంపట్ల ఆత్మీయత లేక వ్యక్తి నిష్ఠులైనందువల్లనే పరాయివారు కొద్ది మందే, మనకన్నా తక్కువ గుణాలు కలవారే, మనకన్నా సంస్కృతీ సభ్యతలలోతక్కువ స్థితికలవారే వచ్చి మనను పరాభవించగలిగారు. మన దేవాలయాలు ధ్వంసమైనాయి. రాజ్యాలు చితికిపోయినాయి. విద్యా వాణిజ్య

కేంద్రాలు నశించాయి. ప్రతి అల్పుడూ మనను పరాభవించగలిగాడు. మనం ఒకరి అవమానానికి మరొకరం సంతసించాం. మన సమాజం లోంచి వ్యక్తులు వెళ్ళిపోతుంటే నీరసంగా ఉపేక్షించాం. మన తల దక్కితే చాలని కండ్లు మూసుకున్నాం. దాంతో సమాజంలో పరమ బలహీనస్థితి ఏర్పడ్డది. పది, ఇరవైమంది అశ్వికులు, నిర్వాసితులు బయలుదేరి వేల కొలది విద్వాంసులుగల నలందా విశ్వవిద్యాలయాన్ని విధ్వంసం చేశారు. వ్రేళ్ళమీద లెక్కపెట్టదగు ఆంగ్లేయులు వ్యాపారం కొరకు వచ్చి మహా సామ్రాజ్యాన్ని స్థాపించారు. వారికి బాసటగా నిలిచింది మనమే. మనలో ప్రతివాడూ తనకొరకు రాష్ట్రస్వత్వాన్ని నష్టపరిచాడు. సమాజభావం పూర్తిగా నశించింది. మనపై మనకే మమత్వం నశించిదన్నమాట! అంటే రాష్ట్ర శక్తికి అత్యవసరమైన నిత్య వ్యవహార జీవనంలో "ఇది నా దేశం. వీరు నా సోదరులు. ఈ దేశంలో, ఈ నా తోటివారితో నా అనుబంధం అనంతం, శాశ్వతం. కనుక దీన్ని కాపాడుకునే వ్యవహారమే, జీవనమే రాష్ట్ర క్షేమానికి పోషకం" అనే సత్యం విస్మృతమైందన్నమాట.

మన సమాజంలో ఈ లోపమునే డాక్టర్జీ చూశారు. దానిని తొల గించేందుకే మన రాష్ట్రీయ సయంసేవక సంఘాన్ని స్థాపించారు. దేశంలో అనేక కార్యక్రమాలు నడుస్తుందేవి. వాటికి సేవ, త్యాగం అని పేరు పెట్టడం డాక్టర్జీకి చిత్రంగా తోచేది. ఒక మనిషియొక్క విస్తృతరూపం కుటుంబం, కుటుంబ విస్తృత రూపమే సమాజం. ఆలికి అన్నం పెట్టడం ఊరికి ఉపకారం కాదుకదా! మరి దేశానికి, రాష్ట్రానికి, సమాజానికి సంబం ధించినపనులు చేసేటప్పుడు ఏదోఒక ఉపకారం చేస్తున్నామనే భావన ఎందుకు రావాలి? నాది అన్న భావన ఏర్పడ్డప్పుడు దానికై ఎంత ఆత్మీయత కావాలి? కష్టపడవచ్చు. త్యాగం చేయవచ్చు. కాని, ఆత్మీయత లేనిచో ఏదో

రూపంలో ప్రతిఫలాపేక్ష ఉండి తీరుతుంది. అది లభించనప్పుడు కక్షలు, సాధింపులు పుట్టితీరుతాయి.

కనుకనే పూజ్య డాక్టర్జీ స్వయం సేవకుల వ్యవహారం గురించి పట్టుదలతో ఉండేవారు. నేనేదో, ఎవరికో సేవ చేస్తున్నాననుకోవద్దు; ఇది మనదే; ఈ సమాజం మన కుటుంబమే; తిరస్కరించినా, వ్యతిరేకించినా, ఎదిరించినా మన కుటుంబం మనది కాకుండా పోదుకదా! కనుక మన వాక్కులో "సత్యం బ్రూయాత్ - ప్రియం బ్రూయాత్, నబ్రూయాత్ సత్యమప్రియమ్" అనే తత్వం ఉండాలి. అందే ఎంతటి సత్యాన్నైనా మధురంగా చెప్పాలి. మన పని హృదయాలను జయించడం - వ్యతిరేకత సృష్టించుకోడం కాదు. అనుస్యూతమైన రాష్ట్రీయ భావాన్ని, 'సత్యా'న్ని పునరుద్ధరించడానికి స్వయం సేవకుడు మధుర వ్యవహారాన్ని అనుసరించాలి. అది ప్రదర్శన కారాదు. స్వభావం కావాలి. స్వత్వంనుండి ఉద్గమించే ఈ ప్రేమ, స్నేహభావాలతో నిండిన కర్తవ్య నిష్ఠ అనే గంగలో మన రాష్ట్రీయులను మంచి పవిత్రులను చేయవలె. అలా ప్రేమ, ఆత్మీయత, పరస్పరావగాహనగల వ్యక్తులను, రాష్ట్ర తత్త్వోపాసకులను ఒకచోట చేర్చి, వారి అభేద్యమైన సంఘటనతో దేశంలో ఆవరించిన వికారాలను కడిగివేయాలి. దానికై స్వయంసేవకుడు, నిరంతరం ఆత్మ పరీక్ష చేసుకుంటూ ఉండాలి - అని డాక్టర్జీ ఉద్బోధిస్తూ ఉండేవారు.

శాఖలలో స్వయంసేవకులతో, పరిసర సోదర ప్రజలతో వ్యవహరించేటప్పుడు స్వయంసేవకుడు మధురంగా, స్నేహంగా, సూర్యునంతటి ప్రఖర కర్మయోగిగా వ్యవహరించాలి; తన ఆదర్శ జీవనం కేవలం ప్రదర్శనం కాదనే యదార్థాన్ని గమనించి ఆచరించాలి. అప్పుడే సంఘం మన మాశించినట్టి రాష్ట్ర శక్తి గంగను అనుస్యూతంగా ప్రవహింప చేయగల వ్యవస్థగా వెలుగొంద గలుగుతుంది. ఇట్టి వ్యవస్థ సమాజాని

కర్తవ్యావశ్యకము. శాఖల నిర్మాణం కొరకు, హైందవ సంఘటనకు మనం ప్రతి శ్రేణిలో ప్రవేశించాలి. మన సమాజం నగరాలలో, పల్లెలలో, అడవులలో, గిరికందాలలో, సాగర తీరాలలో సర్వత్రా వ్యాపించియున్నది. వారి వారి నిత్య కర్మలనుబట్టి, వాతాతపాల ప్రభావాలనుబట్టి ఆచార మర్యాదలలో, ప్రవర్తనా స్థాయిల్లో కొంత విడ్డూరం కన్పించవచ్చు. అయినా వారూ మన సోదరులే, ఏకోదరులే. పరిస్థితులవల్ల వారిలో కొందరు ఆర్థికంగా, బాహ్య సభ్యతా స్థాయిలో కొంత వెనుక ఉండవచ్చు.

వారిని మనమే మాధుర్యంతో, స్నేహంతో, ఆత్మీయతతో సంఘటిత పరచాలి. దానికై నిరహంకారంతో, మమకారంతో వారిని సమీపించాలి. అది తగ్గబట్టేకదా మహ్మదీయులు కత్తి చూపి, ధనం చూపి, పదవుల ఆశ చూపి, మన సమాజ బంధువులను ఆత్మ సమాజం నుంచి వేరు చేసింది. అది తగ్గబట్టే కదా మన సమాజ బంధువులను; ధన విద్యల లంచమిచ్చి, వేలకొలది మైళ్ళ దూరంనుంచి వచ్చిన మిషనరీలు మన మాతృ సమాజం నుంచి వేరు చేస్తున్నాది. అది తగ్గబట్టే కదా విదేశీయులు, విదేశీవాదాలతో భౌతిక వాదాలతో, ధనంతో, పంచమాంగ దళాల సహాయంతో, నిరంతర ప్రచారంతో, అనేకమైన "ఇజాల" ఆధారంతో మన సమాజ బంధువులను మాతృ సమాజం నుండి వేరుచేస్తున్నది? ప్రతి హిందువుకూ తన సమాజం పట్ల దృఢమైన విశ్వాసం కలిగేటట్లు వాతావరణం నిర్మించాలంటే నిష్కల్మషమైన, నిర్హేతుకమైన మమత్వం మన వ్యవహారంలో కన్పించాలి. అప్పుడే సమాజ వ్యక్తులలో పరస్పర విశ్వాసం. దాని పునాదిపై ప్రబల శక్తి జాగృత మవుతాయని సంఘం చెప్పుతున్నది.

అలా మమత్వాలతో స్వచ్ఛంగా సమాజ బాంధవులను సమీకరించే వ్యక్తులకు ఆత్మ పరిశీలనార్థం కర్మ ప్రబోధం నిమిత్తం ఏటా మకర సంక్రమణం వస్తుంది. మన ఆదర్శాన్ని మనకు జ్ఞప్తికి తెస్తుంది. మన ఆచరణలో మాధుర్య స్నేహాల స్నిగ్ధతను బలపరచిపోతుంది.

